CASIO

# చేయి వేస్తే చాలు
# సంగీతం పలుకుతుంది!!



కాసియో ఉంటే చాలు. కావలసిన సంగీతమంతా ఝుమ్మని వాయించేసుకో వచ్చు... దీని మెట్ల మీద చేయి వేస్తే చాలు, సంగీతం పలుకుతుంది.

నీకు నచ్చిన పాటల బాణీ తెలుసుకో. వాయిస్తూ పో...నీ ఫ్రెండ్సంతా ఆ దరువుకు గంతు లేస్తుంటే నువ్వొక సంగీతం స్టారైపోతావు!

ఇక మరి అలస్యమెందుకు! కాసియో మెట్లలో కావలసినంత సంగీతం... సూపర్ హిట్ సంగీతం. అది వినిపించడం నీ చేతిలో పని!



## SA-20

- 32 మినీ కీస్
- 100 పి సి ఎమ్ ప్రీసెట్ టోన్స్
- 19 పి సి ఎమ్ ఆటో రిథమ్స్
- 13 "సూపర్ ఎకాంపెనిమెంట్" బ్యాకింగ్ ప్యాటర్న్స్
- ప్రీసెట్ డెమాన్‌స్ట్రేషన్ ట్యూన్
- డ్యుయల్ స్పీకర్ సిస్టం.



## PT-380

- 32 మినీ కీస్
- 100 పి సి ఎమ్ ప్రీసెట్ టోన్స్
- 12 పి సి ఎమ్ ఆటో రిథమ్స్
- వెంట మినీ మైక్రోఫోన్
- రామ్ ప్యాక్ వాడే వీలు
- మెలడీ గైడ్ ఫంక్షన్
- 5 బిల్ట్-ఇన్ సౌండ్ ఎఫెక్ట్ ప్యాడ్స్

**CITY MUSIC CO., PTE LTD.**
Singapore Tel 3377058, 3377545

**ONFLO MUSIC CO., LTD.**
Hong Kong Tel: 722 4195

**RAINBOW PHOTO FINISHERS PTE LTD.**
Nepal, Kathmandu Tel 221724

**GENERAL ENTERPRISES COMPANY**
U.A.E., Dubai Tel: 224131/2/3

**MAHMOOD SALEH ABBAR CO.**
Saudi Arabia, Jeddah Tel: (02)6473995

**ARABIAN CAR MARKETING CO.,LTD.**
Oman Tel: 793741

**CASIO COMPUTER CO., LTD.**
Tokyo, Japan



# చందమామ

డిసెంబర్ 1990



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి


## అనాలోచిత కృత్యం!

కేంద్ర ప్రభుత్వం తీసుకున్న ఒక నిర్ణయానికి వ్యతిరేకత తెలియజేయడానికి పలువురు యువతీయువకులు ప్రాణత్యాగం చేశారు!

మన ఎదుట ఏదైనా అన్యాయం జరుగుతున్నప్పుడు, వ్యతిరేకించి పోరాడడం అవసరమే. అయితే, వ్యతిరేకత వ్యక్తంచేసే పద్ధతి కూడా సరైనదిగా ఉండాలి. అప్పుడే ఆశించిన ఫలితాలు సాధించడం సాధ్యం. ఒక సిద్ధాంతాన్ని, వ్యతిరేకించి జరిపే పోరాటంలో ప్రాణాలు కోల్పోవడం అన్నది వేరే విషయం. అయితే, ఆత్మాహుతి చేసుకోవడమే పోరాటంగా సాగించడం, ఏమాత్రం సముచితం కాదు. మనదేశ స్వాతంత్ర్యోద్యమంలో త్యాగమూర్తులెందరో పీరోచితంగా పోరాడి ప్రాణాలు అర్పించారే తప్ప, ఆవేశాలకు లోనై ఆత్మాహుతికి పాల్పడలేదు!

మన పరిధిలోని హక్కులు ఏవి? అతీతమైనవి ఏవి? అన్న విషయం గ్రహించాలి. పరమాత్మ ప్రసాదించిన ప్రాణాలు తీసుకోవడానికి మనకు హక్కు లేదు. పైగా, అది సమస్యకు పరిష్కారం కూడా కాదు!


| సంపుటి 87 | డిసెంబర్ '90 | సంచిక 6 |
|---|---|---|
| విడి ప్రతి : 3-00 | :: | సంవత్సర చందా : 36-00 |







# నోబెల్ శాంతి బహుమతి

"శాంతిని నెలకొల్పాలంటే, యుద్ధానికి సిద్ధంగా ఉండాలి!" అన్నది ప్రాచీన రోమనుల అభిమాన సిద్ధాంతం. నిజానికి ఈ సిద్ధాంతం ఎన్నటికీ శాంతి సమకూర్చదు. యుద్ధ సన్నద్ధత యుద్ధానికి మాత్రమే దారి తీస్తుంది. ఏదైనా ఒక దేశం యుద్ధానికి సిద్ధంగా ఉందనుకుందాం. అది ఇరుగుపొరుగు దేశాలలో భయానుమానాలను రేకెత్తిస్తుంది. అందువల్ల ఆ దేశాలు కూడా అపాయాన్ని ఎదుర్కొవడానికి సంసిద్ధమవుతాయి. ఏ క్షణంలో ఎటువైపు నుంచి అపాయం ముంచుకువస్తుందో అని ఇరుగుపొరుగు దేశాలు యుద్ధానికి సిద్ధంగా ఉన్నప్పుడు, యుద్ధం రావడానికి చిన్న సంఘటన లేదా అతి స్వల్ప అపార్థం చాలు కదా!

రోమనుల కాలం నుంచి ఈనాటి వరకు అదే పరిస్థితి కొనసాగుతున్నది. నాయకులందరూ దిక్కులు పిక్కటిల్లే విధంగా శాంతి ఉపన్యాసాలు ఇస్తారు. కాని వారి చిత్తశుద్ధి మాత్రం అనుమానాస్పదమే. ఎందుకంటే, ఇతరదేశాలకు మారణాయుధాలు విక్రయించడం ద్వారానే వారు చాలావరకు తమ దేశ సంపదలను సమకూర్చుకుంటున్నారు! మనసులలో యుద్ధకాంక్ష ఉన్నప్పటికీ పెదవులపై శాంతి పాఠాలు వల్లించడం నాయకులకు సహజ స్వభావమై పోయింది!






మనసులో శాంతి లేకుండా బాహ్య ప్రపంచంలో శాంతికోసం వెదుకులాడడం నిష్ప్రయోజనం. నాయకుల హృదయాలలో శాంతి ఉన్నప్పుడే వారిచ్చే ఉపన్యాసాలు అర్థవంతాలవుతాయి!

సోవియట్ నాయకుడు మిఖైల్ గోర్బచేవ్ ఆ దిశ వైపే పయనిస్తున్నాడు. ఆయన కేవలం శాంతిప్రియుడు మాత్రమే కాదు; శాంతి వీరుడు. ఆయనకు ముందు, కమ్యూనిస్టు నియంతృత్వం—సోవియట్ ప్రజలనూ, ఇంకా, దాని అధికార హస్తాలకు లోబడిన పోలండు వంటి దేశప్రజలనూ దురన్యాయానికి గురిచేసింది. పాశ్చాత్య దేశాలతో ముఖ్యంగా, అమెరికాతో ఆయుధపోటీకి తలపడి, మారణాయుధాల తయారీని ప్రోత్సహించింది. అవన్నీ అవమానకరమైన విషయాలని బహిరంగంగా అంగీకరించిన ధీశాలి గోర్బచేవ్. వ్యక్తి స్వాతంత్ర్యాన్నీ, దేశ స్వాతంత్ర్యాన్నీ గౌరవించాలి. ఒకరి గొంతును మరొకరు కోసుకోకుండా పరస్పర అవగాహనతో, సహకారంతో మసలుకోవాలి!

గోర్బచేవ్‌కు నోబెల్ శాంతి బహుమతి లభించడం గొప్ప విశేషం. అందుకు కారణం ఆ బహుమతిని సరైన వ్యక్తికి ఇవ్వడం మాత్రమే కాదు, ఆ శాంతి ప్రియుడి ఆశయాన్నీ, అభిమతాన్నీ ప్రపంచం గుర్తించడం. అలా గుర్తించడంలోనే ప్రపంచశాంతి ఆధారపడి ఉన్నది.



# పరీక్ష

చందనదేశాన్ని పరిపాలించే విక్రమవర్మకు పురుషసంతతి లేదు. ఉన్న ఒకే ఒక కుమార్తె శ్రీలేఖను, ఆయన అల్లారు ముద్దుగా పెంచి, సమస్త విద్యలూ చెప్పించాడు. యుక్తవయసు వచ్చేసరికి ఆమె అసమాన సౌందర్యరాశిగానూ, అమిత మేధావిగానూ ఖ్యాతి కెక్కింది. కుమార్తెను చూసి గర్వపడిన విక్రమవర్మకు, ఆమె వివాహంగురించిన చింత ప్రారంభమైంది. తనకు పురుషసంతతి లేని కారణంగా, తనకు కాబోయే అల్లుడే చందనదేశానికి భావి మహారాజు అవుతాడు! అంతేకాక తనకుమార్తె అత్యంత బుద్ధిశాలి. అందుచేత సునిశిత ప్రజ్ఞాశాలిని అల్లుడుగా చేసుకోవాలని విక్రమవర్మ ఆరాటపడ సాగాడు.

ఇలా వుండగా ఒకసారి విక్రమవర్మ ఆస్థానానికి, ఒక పండితుడు వచ్చాడు. అతడు రాజుకు తనను తాను పరిచయం చేసుకుంటూ, ''మహారాజా! నన్ను కేశవభట్టు అంటారు. నా స్వదేశం మధ్యదేశం. కాశీ, తక్షశిలా విద్యాపీఠాల్లో నన్ను మించినవాడు లేడన్న పేరు పొంది, అనేక దేశాల పండితుల్ని ఓడించి, ఆయా రాజుల చేత సన్మానాలు పొంది వస్తున్నాను. నేను మూడు ప్రశ్నలు అడుగుతాను. వాటికి మీ దేశంలో వున్న పండితపామరులెవరైనా సమాధానాలు చెప్పవచ్చు. సరైన సమాధానాలు చెప్పగలిగితే చెప్పిన వ్యక్తి ముందు శిరస్సువంచి నమస్కరించి, నా బిరుదులూ గండపెండేరమూ ఆ వ్యక్తి పరంచేస్తాను. అలా కాని పక్షంలో నన్ను, మీ ఆస్థానపండితుల చేత పల్లకీలో మోయించి, సత్కరించి పంపాలి. అంగీకారమైన పక్షంలో చెప్పండి!'' అన్నాడు.

కేశవభట్టు అహంకార ధోరణి పండితులకే కాక, విక్రమవర్మకు కూడా అసహ్య

లక్ష్మిగాయత్రి



కరంగాతోచింది. అయినా, పైకిఏమీ వ్యక్తం చెయ్యకుండా, ''మీ షరతులకు అంగీకరిస్తున్నాం. మీరు మూడు ప్రశ్నలు అడగండి! మా దేశస్థులు వాటికి మూడు రోజుల్లోగా సమాధానం చెబుతారు,'' అన్నాడు.

కేశవభట్టు అంగీకారంగా తల వూపి, ఇలా చెప్పాడు: నా మొదటి ప్రశ్న: ఎవరూ కాదనలేని నిజం ఒకటి చెప్పాలి. అయితే అది తిరుగులేని అబద్ధమై వుండాలి! రెండవ ప్రశ్న: వినిపించని శబ్దమూ, కనిపించని దృశ్యమూ ఏవి? మూడవ ప్రశ్న: కూలివాడి దగ్గిర నుంచి, రాజువరకూ, ఏ వ్యక్తి అయినా అతి తేలికగా లొంగిపోయేది దేనికి?

కేశవభట్టు ప్రశ్నలు వినగానే విక్రమవర్మ ఆస్థాన పండితుల ముఖాలు వెలవెలపోయాయి. దానిని గమనించిన కేశవభట్టు, తనకు విజయం తప్పదని సంతోషిస్తూ, రాజు దగ్గిర సెలవు తీసుకుని, తనకు ఏర్పాటు చేసిన విడిదికి వెళ్ళిపోయాడు.

కేశవభట్టు వెళ్ళిపోగానే, ఆస్థాన పండితులు జవాబులకోసం చర్చించుకోసాగారు. మొదటి ప్రశ్నకు జవాబు ఎవరూ చెప్పలేకపోయారు. రెండవ ప్రశ్న తర్కశాస్త్రానికి సంబంధించినదై వుండవచ్చుననీ— వినిపించని శబ్దం ఆకాశమూ, కనిపించని దృశ్యం వాయువూ అయి వుంటుందనీ అభిప్రాయపడ్డారు. కూలివాడి నుంచి, రాజువరకూ ఎవరైనా సరే లొంగిపోయేది వ్యాధికి కావచ్చునని ఊహించారు.

కాని విక్రమవర్మకు వారి సమాధానాలు తృప్తినివ్వలేదు. ఆయన పండితులతో, ''కేశవభట్టు చాలా అహంకారేకావచ్చు, కాని గొప్ప మేధావి. అతడి ప్రశ్నలు ఎంతో నిగూఢంగా వున్నవి. వాటికి మీరు ఊహించిన జవాబులు అర్థరహితం అనిపిస్తున్నవి. సరైన జవాబులకోసం అన్వేషణ సాగించండి,'' అని సభ చాలించి, కుమార్తె అంతఃపురానికి వెళ్ళాడు.

గంభీరవదనంతో వచ్చిన తండ్రిని చూసి, శ్రీలేఖ ఆశ్చర్యపడింది.

విక్రమవర్మ, కుమార్తెకు జరిగినదంతా చెప్పి, "అమ్మా, ఓటమి తప్పదేమోనని భయంగా వున్నది. సంస్కారి ముందు ఓటమి అభివృద్ధి కారకమూ, అహంకారి ముందు ఓటమి ఆత్మహత్యతో సమానమూ అన్న సంగతి, నీకు తెలియంది కాదు గదా! అయితే, ఆ ప్రశ్నలకు నువ్వు సరైన జవాబులు చెప్పగలవన్న నమ్మకం, నాకు ధైర్యాన్నిస్తున్నది," అన్నాడు.




అంతా విన్న శ్రీలేఖ కొద్దిసేపు ఏదో ఆలోచించి, "జవాబులు నాకూ తెలియడం లేదు, నాన్నా!" అన్నది.

విక్రమవర్మ ఆ సమాధానానికి ఆశ్చర్యపోయి, "అయితే, ఇప్పుడేం చేసేట్టు తల్లీ!" అన్నాడు.

అందుకు శ్రీలేఖ నవ్వి, "నేను జవాబులు చెప్పలేకపోయినా, జవాబులు దొరికే ఉపాయం చెప్పగలను. మన మంత్రి కుమారుడు రాజశేఖరుడు గొప్ప మేధావి అని విన్నాను. ఈ ప్రశ్నలకు అతడ్ను జవాబు చెప్పగలడని, నా నమ్మకం. అడిగి చూడండి!" అన్నది.

ఈ మాటలతో విక్రమవర్మ సాలోచనగా తల పంకించి, లేచి వెళ్ళిపోయాడు.

విక్రమవర్మ తర్వాత పట్టపురాణి వైజయంతీదేవి దగ్గిరకు వెళ్ళి, సంగతి చెప్పి, "దేవీ! శ్రీలేఖ సంగతి నాకు బాగా తెలును. సమాధానాలు నిజంగా చెప్పలేక పోయినట్టయితే తనకు ఆపాటి పాండిత్యం లేనందుకూ, దేశవు వరుపు ప్రతిష్ఠల గురించీ దిగులు చెంది వుండేది. కానీ అటువంటి విచారమేదీ ఆమె ముఖంలో కనిపించలేదు. పైగా రాజశేఖరుడు తప్పక చెప్పగలడన్న విశ్వాసం, ధీమా ఆమె ముఖంలో కనిపించాయి. విషయమేమిటంటావు?" అని ప్రశ్నించాడు.

వైజయంతి నవ్వి, "స్త్రీ హృదయం వేరొక స్త్రీకే బాగా తెలుస్తుందనా, నా దగ్గిరకు వచ్చారు?" అన్నది.

విక్రమవర్మ కూడా నవ్వి, "అలాంటిదేం లేదు. శ్రీలేఖ విషయంలో, నీనుంచి




అదనపు సమాచారం తెలుసుకోవాలని వచ్చాను,'' అన్నాడు.

''అయితే వినండి! శ్రీలేఖ రాజశేఖరుణ్ణి అభిమానిస్తున్నదని, దాని చెలికత్తెల ద్వారా విన్నాను. అతడు కూడా శ్రీలేఖను అభిమానిస్తున్నట్టు తెలిసింది. శ్రీలేఖ ఈ ప్రశ్నలకు అతడినుంచి జవాబులు రాబట్టడం ద్వారా, అతడి ప్రజ్ఞావిశేషాలను మనను పరీక్షించి, తగిన వరుడు అవునో కాదో నిశ్చయించమని చెప్పడమే!'' అన్నది రాణి.

కుమార్తె ఆలోచనా సరళికి ముగ్ధుడైన విక్రమవర్మ, ''అయితే ఆలస్యం దేనికి? వెంటనే అతడిని పిలిపిద్దాం. అటు రాచకార్యమూ, ఇటు గృహకార్యమూ కూడా నెరవేరుతవి,'' అన్నాడు.

మరి కొద్దిసేపట్లో రాజశేఖరుడు వచ్చాడు. ఎప్పుడో ఉత్సవాల్లో తప్ప అతడిని ప్రత్యేకంగా గమనించని విక్రమవర్మ, అతడి స్ఫురద్రూపాన్నీ, తేజోవంతమైన ముఖవర్చస్సునూ పరీక్షగా చూసి కుమార్తె ఎన్నికను మనసులోనే మెచ్చుకుంటూ, ''కూర్చో, నాయనా!'' అన్నాడు.

తర్వాత విక్రమవర్మ అతడికి విషయమంతా చెప్పి, ''నువ్వు తప్పక జవాబులు చెప్పగలవని శ్రీలేఖ విశ్వాసం!'' అన్నాడు.

రాజశేఖరుడు చిన్నగా నవ్వి, ''ప్రభూ! కేశవభట్టు అత్యంతమేధావి అనేదానిలో సందేహం లేదు. అతడు శాస్త్రాన్నీ, కల్పననూ, వాస్తవాన్నీ తన మూడు ప్రశ్నల లోనూ యిమిడ్చాడు! అతడి మొదటి ప్రశ్న తర్కశాస్త్రానికి సంబంధించినది. దానికి జవాబు, 'నాకు మరణం లేదు!' ఇది లౌకికంగా తిరుగులేని అబద్ధం! ఎందువల్లనంటే, సృష్టిలో మరణం లేని ప్రాణి ఏదీ లేదు. అయితే, తార్కికంగా అది ఎవరూ కాదనలేని నగ్నసత్యం! కారణం, తర్కబద్ధంగా చెప్పాలంటే 'నేను' అనే సదం, ఆత్మకు వర్తిస్తుందే కాని, పాంచభౌతికమైన శరీరానికి వర్తించదు. అంటే ఆ వాక్యానికి అర్థం.

ఆత్మకు మరణం లేదు!' అని. ఆ విధంగా పైవాక్యం, తార్కికంగా ఎవరూ కాదనలేని నిజమూ, లౌకికంగా తిరుగు లేని అబద్ధమూ అయింది! ఇదే మొదటి ప్రశ్నకు జవాబు." అన్నాడు.

రాజశేఖరుడి వ్యాఖ్యానానికి సంతోషించిన విక్రమవర్మ, "బాగా చెప్పావు, నాయనా! మిగిలిన రెండు ప్రశ్నల జవాబులు కూడా చెప్పు!" అన్నాడు.

దానికి రాజశేఖరుడు, "రెండవ ప్రశ్నలో వినిపించని శబ్దం, మనసుచేసే బోధ! అది శబ్దతరంగాల ద్వారా కాక, మనసు ద్వారా మెదడుకు చేరే వాక్కు. అనుభవించేవాడికి తప్ప, రెండో వ్యక్తికి వినిపించదు! అలాగే కనిపించని దృశ్యం ఊహ! ఊహించుకునేటప్పుడు, కళ్ళకు కట్టినట్టు కనిపించే దృశ్యం, ఊహించుకునే వ్యక్తికే అనుభవమవుతుంది. పైరెండూ స్థిరమైన అస్తిత్వాలు కలిగినవి కావు గనుకా, అయినప్పటికీ అనుభవైక వేద్యాలూ కనుకా—వినిపించని శబ్దమూ, కనిపించని దృశ్యమూ అయినాయి. ఇదే రెండవ ప్రశ్నకు జవాబు," అన్నాడు.

విక్రమవర్మ ఆనందంగా రాణీవైపు చూశాడు. ఆమె ప్రశంసాపూర్వకంగా నవ్వుతూ, "చాలా బాగా చెప్పావు, నాయనా!" అన్నది.




తర్వాత రాజశేఖరుడు, "ఇక మూడవ ప్రశ్నకు జవాబు, పొగడ్త! కూలివాడి దగ్గిర నుంచి రాజువరకూ, అతితేలికగా లొంగిపోయేది పొగడ్తలకే గదా!" అంటూ ముగించాడు.

విక్రమవర్మ చప్పట్లుచరుస్తూ, "శభాష్, రాజశేఖరా! చాలా చక్కటి జవాబులు చెప్పావు. నీ తెలివికి ఇంకొక పరీక్ష పెడుతున్నాను. ఇప్పుడు నీకు కనిపించనిదీ, నాకు కనిపించేదీ అయిన దృశ్యం ఏమిటో చెప్పు చూద్దాం!" అన్నాడు.

రాజశేఖరుడు చిరునవ్వుతో, "పొరబడుతున్నారు, మహారాజా! మీకు కనిపించే దృశ్యం, నాకూ కనిపిస్తున్నది," అన్నాడు.

రాజు ఆశ్చర్యపడి, "నీకూ కనిపిస్తు న్నదా? అదేమిటో చెప్పు," అని అడిగాడు.

రాజశేఖరుడు కొద్దిగా సంకోచిస్తూ, "మీ అమ్మాయి నాకు వరమాల వేస్తున్న దృశ్యం!" అన్నాడు.

ఆ జవాబు విని రాణి వైజయంతి మనసులోనే నవ్వుకున్నది.

విక్రమవర్మ మాత్రం కోపం నటిస్తూ, "ఏమిటి! ఏదో మూడు ప్రశ్నలకు జవాబులు చెప్పినంతమాత్రాన, రాజకుమార్తె నిచ్చి వివాహం చేస్తాననుకున్నావా?" అన్నాడు.

రాజశేఖరుడు నవ్వి, "మీకు ఆ ఉద్దేశం లేనిపక్షంలో, ప్రశ్నలకు సరైన జవాబులు నేను చెప్పగానే మెచ్చుకుని, 'బాగానే వున్నాయి కానీ, ఇవి సరైనవి అవునో కాదో కేశవభట్టు చెప్పాలి గదా!' అని వుండేవారు. అంతేగాని, రాజకార్యాలను మరిచిపోయి, నన్ను ఇంతగా ప్రశంసించి, నా తెలివికి ఇంకో పరీక్ష పెట్టి వుండేవారు కాదు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే విక్రమవర్మ ఆనందంతో రాజశేఖరుణ్ణి కౌగలించుకుని, "నాయనా, తిరుగులేని ఆత్మవిశ్వాసం గల నువ్వు, మా శ్రీలేఖకు తగిన వరుడివి! మన ఇద్దరికి కనిపించిన దృశ్యాన్ని, త్వరలోనే అందరికీ కనిపించేటట్టు చేస్తాను." అన్నాడు.

ఆ సాయంత్రమే సభ ఏర్పాటయింది. సభకు కేశవభట్టుతో బాటు, రాణి వైజయంతీదేవి, శ్రీలేఖ, రాజశేఖరుడు కూడా వచ్చారు. నిండుసభలో, రాజశేఖరుడి సమాధానాలు విన్న కేశవభట్టు, అతడి సమాధానాలు సరైనవేనని అంగీకరిస్తూ, తాను ఓడిపోయినట్టు ఒప్పుకుని, శిరస్సు వంచి రాజశేఖరుడికి నమస్కరించి, తన బిరుదులన్నీ అతడిపరం చేసి, తన గండపెండేరాన్ని తీసి, రాజశేఖరుడికి స్వయంగా తొడిగాడు.

ఆ తర్వాత, సభాసదుల శుభాశీస్సుల మధ్య, శ్రీలేఖ రాజశేఖరుడి మెడలో వరమాల వేసింది.






## 16

[వీరసింహుడి ఆజ్ఞ ప్రకారం సర్పదంతుడు, శంకరవర్మనుంచి బంగారు విగ్రహాన్ని బలపంతంగా వశపరచుకుని దానిని నదీమార్గం గుండా కాంతిపురానికి చేర్చడానికి పూనుకున్నాడు. అయితే, యువరాజు నందీపుడు మార్గమధ్యంలోనే ఆ విగ్రహాన్ని అపహరించి, శంకరవర్మకు అప్పగించాడు. నందీపుణ్ణి చూసి శంకరవర్మ పరమానందంచెందాడు. —తరవాత]

భటులు తీసుకువచ్చిన బంగారు విగ్రహం పడవనుంచి మాయమైపోయిందన్న వార్త విని, వీరసింహుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని, ఆ తరవాత పిడికిలి బిగించి, ''మాయలు! మంత్రాలు! మంత్ర తంత్రాలకే హడిలిపోయి మనం ఊరుకోవాలా? అంతమాత్రానికి మనకు సైన్యం దేనికి? దళ నాయకులెందుకు?'' అన్నాడు ఆగ్రహంతో.

''ప్రభూ, మనదగ్గర సైనిక బలం ఉన్న మాట నిజమే. అయినా, అతీత శక్తులను ఎదుర్కొని మానవశక్తి ఎంతవరకు పోరాడగలదు? అరణ్య మధ్యంలో మృగాలు మన సైనికులను తరిమికొట్టిన దృశ్యం తమరు చూశారు కదా! వాటిమీద ఏవో అతీత శక్తుల ప్రభావం లేకపోతే, ఆ మృగాలు ఒక్కసారిగా అలా తిరగబడేవేనా!'' అన్నాడు సర్పదంతుడు.



''మహాప్రభూ! మన భటుల నుంచి మాయమయినబంగారువిగ్రహం,ప్రస్తుతం శంకరవర్మ రాజ్యంలో ఉన్నది. కొత్తగా కట్టిన గుడిలో రేపే విగ్రహప్రతిష్ఠాపన జరుపబోతున్నారు!'' అన్నాడు గూఢచారి.

''నిజంగానా!'' అని అడిగాడు వీరసింహుడు ఉత్సాహంగా.

''అవును ప్రభూ, ముమ్మాటికీ నిజం!'' అన్నాడు గూఢచారి.

వెంటనే లేచి నిలబడిన వీరసింహుడు, పట్టరాని ఆవేశంతో, ''అంటే, బంగారు విగ్రహాన్ని దొంగిలించడానికి శంకరవర్మే ఏ మాంత్రికుణ్ణో నియోగించాడన్నమాట! ఆ నీచుడికి జీవితంలో మరచిపోని గుణపాఠం నేర్పాలి!'' అన్నాడు.

''ప్రభూ, ఇప్పుడే వెళ్ళి ఆ విగ్రహాన్ని తీసుకురమ్మని సెలవా!'' అన్నాడు సర్పదంతుడు.

''ఎందుకూ? మళ్ళీ దాన్ని మాంత్రికుడి పరం చేయడానికా? నువ్వు వద్దు ఆ పనికి మేమే స్వయంగా వెళతాము. సాహసవంతులయిన వీరులు కొందరు మా వెంట రావడానికి వెంటనే ఏర్పాటు చెయ్. విగ్రహాన్ని మేమే స్వాధీనం చేసుకుంటాం. మాయలు, మంత్రాలు ఎలా పని చేస్తాయో మేమే చూస్తాం!'' అని ఆజ్ఞాపించాడు వీరసింహుడు.

దానికి వీరసింహుడు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. అయితే, తన బలహీనతను కప్పి పుచ్చడానికి ప్రయత్నిస్తూ, ''సరే, జరిగిందేదో జరిగిపోయింది. మరి ఇప్పుడా బంగారు విగ్రహం ఎక్కడున్నదో తెలుసుకోవద్దా? ఇలాంటి అవమానాలను భరిస్తూ ఎంతకాలమని చేతులు కట్టుకుని కూర్చుంటాము?'' అని సభ మారుమ్రోగేలా అరిచాడు.

అంతలో ఆస్థాన ప్రధాన గూఢచారి అక్కడికి వచ్చి, వీరసింహుడికి వంగి నమస్కరించాడు.

''ఏమిటి వార్త?'' అని అడిగాడు వీరసింహుడు.

జయపురి ప్రజలు అంతులేని ఆనందోత్సాహలతో ఉన్నారు. యువరాజు సందీపుడు కనకదుర్గ విగ్రహాన్ని తెచ్చి తనకు అప్పగించిన విషయాన్ని రాజు శంకరవర్మ రహస్యంగా దాచాడు. ఆ కారణంగా, విగ్రహం మళ్ళీ తమ రాజ్యానికి చేరడం జయపురి ప్రజలకు అద్భుతంగా తోచింది. కొత్తగా కట్టిన గుడిలో విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి పిల్లలూ, పెద్దలూ ఇనుమడించిన ఉత్సాహంతో పని చేయసాగారు.



యువరాణి సుకన్య విగ్రహాన్ని వదిలిపెట్టకుండా పక్కనే కూర్చున్నది. తండోపతండాలుగా వచ్చిన ప్రజలు కనకదుర్గ విగ్రహాన్నీ, పక్కనే ఉన్న యువరాణినీ చూసి ఎంతగానో మురిసిపోయారు.

విగ్రహ ప్రతిష్ఠాపనకు పండితులు నిర్ణయించిన శుభఘడియలు ఆసన్నమయ్యాయి. మంగళవాయిద్యాలు మ్రోగుతూ వుండగా, ఆలయపూజారీ, శంకరవర్మా, సుకన్యా విగ్రహాన్ని రాజభవనం నుంచి ఆలయం దగ్గరికి భక్తితో మోసుకుపోతున్నారు.

"ఆపండి ఉత్సవం!" అన్న కేక వినిపించింది. మేళతాళాల శబ్దంలో, వీరసింహుడి కేక మొదట ఎవరికీ వినిపించలేదు. అయినా, గుర్రాల మీద వచ్చిన సైనికులను చూడగానే మేళతాళాలు వాయించేవాళ్ళు భయంతో అలాగే ఆగిపోయారు.

మొదట వీరసింహుడూ, అతని వెంట సర్పదంతుడూ, అంగరక్షకులూ వచ్చారు.

"శంకరవర్మా! యుద్ధం చేయడం నీ అభిమతం కాదనుకుంటాను. ఒకవేళ నీకు యుద్ధం చేయాలన్న కోరిక ఉన్నట్టయితే అందుకు మేము సిద్ధంగా వచ్చాం," అన్నాడు వీరసింహుడు.

"మీతోనే కాదు; మరెవరితోగాని యుద్ధం చేసే శక్తి నాకు లేదని నీకు తెలుసు. మమ్మల్నీ, మా ప్రజల్నీ ప్రశాంతంగా జీవించడానికి అనుమతించు," అన్నాడు శంకరవర్మ.



''నువ్వు బంగారు విగ్రహాన్ని శాంతియుతంగా మాకు అప్పగించావంటే, మేము మీ శాంతికి ఎటువంటి హానీ కలిగించం!'' అన్నాడు వీరసింహుడు.

''అది అసాధ్యం!'' అన్నది సుకన్య.

వీరసింహుడు ఆమె కేసి ఆశ్చర్యంగా చూశాడు. సుకన్య విగ్రహాన్ని గట్టిగా కౌగిలించుకున్నది.

''ఎవరామె?'' అని అడిగాడు వీరసింహుడు.

''నా కుమార్తె సుకన్య. ఆమెకు విగ్రహం పట్ల ఎంతో ప్రేమ.'' అన్నాడు శంకరవర్మ.

''విగ్రహంపట్ల ప్రేమా!'' అంటూ వీరసింహుడు గుర్రం పైనుంచి కిందికి దూకి శంకరవర్మను సమీపించి, ''నాకు సుకన్యపై ప్రేమ!'' అన్నాడు నువ్వుతూ.

''ఏమిటి నువ్వు అంటున్నది?'' అని అడిగాడు శంకరవర్మ ఆశ్చర్యంగా.

''బంగారు విగ్రహాన్ని వదులుకోవడానికి సిద్ధంగా ఉన్నాను.'' అన్నాడు వీరసింహుడు.

''చాలా సంతోషం! ధన్యవాదాలు!'' అన్నాడు శంకరవర్మ.

''అయితే, దానికి బదులుగా నువ్వు నాకు నీ కుమార్తెను ఇవ్వాలి! అవును, నేను సుకన్యను పెళ్ళాడదలిచాను. ఆమెను సుమేధకు పట్టపురాణిని చేస్తాను. ఆ సుకుమారికి శాంతిపుర రాజసౌధంలో సుఖజీవితం సమకూరుస్తాను!'' అన్నాడు వీరసింహుడు వికారంగా నవ్వుతూ.

''వీరసింహా!'' అని అరిచాడు శంకరవర్మ.

''నువ్వు మా సామంతుడివి. మహాప్రభువులయిన మమ్మల్ని సగౌరవంగా సంబోధించడం శ్రేయస్కరం!'' అని హెచ్చరించాడు వీరసింహుడు.

''వీరసింహా! దౌర్జన్యానికి సైతం ఒక హద్దు వుంటుంది!'' అన్నాడు శంకరవర్మ.

''దౌర్జన్యం! ఏది దౌర్జన్యం? మహాప్రభువులు ఒక సామంతుడి కూమార్తెను వివాహమాడాలనుకోవడం దౌర్జన్యమవు

తుందా? శంకరవర్మా, నువ్వు ప్రాణప్రదంగా భావించే బంగారు విగ్రహం గురించీ, పిచ్చుకగూడు లాంటి నీ చిన్న రాజ్యం గురించీ ఒక్కసారి ఆలోచించి చూడు!'' అన్నాడు వీరసింహుడు.

''ఆత్మగౌరవం కాపాడుకోవడానికి నా సర్వస్వాన్నీ పోగొట్టుకోవడానికి సిద్ధంగా ఉన్నాను!'' అన్నాడు శంకరవర్మ.

''శంకరవర్మా, మహారాజునైన నేను నీ కుమార్తెను వివాహమాడడం నీకు గౌరవప్రదం కాదా? నువ్వు నా అభీష్టాన్ని నెరవేర్చినట్టయితే విగ్రహం నీదవుతుంది. కాదన్నావో నీకు నీ విగ్రహమూ దక్కదు; నీ కుమార్తే దక్కదు. అంతేకాదు, నీ రాజ్యం కూడా నా వశమవుతుంది. ఒకవేళ ఎదిరించి పోరాడావో రక్తపాతం, నీకు పరాజయం తప్పవు. ఆలోచించుకో,'' అని హెచ్చరించాడు వీరసింహుడు.

''నాన్నా, అతని కోర్కెను మన్నించు. ఆ విగ్రహం మీ దగ్గరే ఇక్కడే ఉండేట్టయితే, నేను అతని వెంట వెళ్ళడానికి సిద్ధమే!'' అన్నది సుకన్య.

''ఏమిటి తల్లీ ఆ మాటలు! తెలిసే అలా అంటున్నావా?'' అన్నాడు శంకరవర్మ.

''శభాష్! సుకన్య పరిస్థితిని అర్థం చేసుకునే అలా చెబుతున్నది!'' అన్నాడు వీరసింహుడు.



''ఏమిటి పరిస్థితి!'' అంటూ శంకరవర్మ వీరసింహుడి కేసి తిరిగాడు.

ఆ సమయంలో వ్యాపారి వంటి యువకుడొకడు సుకన్యను సమీపించి ఆమె చెవిలో ఏదో చెప్పి, శంకరవర్మ కేసి చూశాడు. వ్యాపారి వేషంలో ఉన్న యువకుడు యువరాజు సందీపుడని శంకరవర్మ గ్రహించాడు. ఆయన కళ్ళు ఒక్కసారి ఆనందంతో మెరిశాయి.

ఆ తరవాత ఆయన కుమార్తె వైపు తిరిగి, ''నువ్వు ఆ మాట మనస్ఫూర్తిగా అంటున్నావా తల్లీ!'' అని అడిగాడు.

''అవును నాన్నా, ఆ విషయంలో మీకెలాంటి అనుమానం వద్దు. ఎందుకంటే



మయ్యాయి. చక్కగా, అలంకరించిన ఏనుగును తీసుకువచ్చి, సుకన్యను పెళ్ళికూతురిలా సింగారించి, ప్రధాన చెలికత్తెతో పాటు ఏనుగు అంబారీపై కూర్చొబెట్టారు. ఏనుగుముందు వీరసింహుడూ, సర్పదంతుడూ వెళుతూ ఉండగా, దాని వెనక సైనికులు బయలుదేరారు.

వాళ్ళందరూ అరణ్యాన్ని సమీపిస్తూండగా, జయానందముని పెంచే చిలుక మళ్ళీ ఎగురుతూ వచ్చి, ఒక లేఖను సుకన్య ఒడిలో జారవిడిచి వెళ్ళింది. దానిని ఎవరూ గమనించలేదు. సుకన్య ఆ లేఖను చదివి, చెలికత్తె చెవిలో ఏదో చెప్పి, కళ్ళు మూసుకుని స్పృహ కోల్పోయినట్టు ఆమె ఒడిలోకి ఒరిగిపోయింది.

''ఆపండి! ఆపండి!'' అని అరిచింది చెలికత్తె.

అందరూ అలాగే నిలబడిపోయారు.

''యువరాణిగారు మూర్ఛపోయారు. కిందికి దించి వెంటనే వైద్యులను పిలిపించండి!'' అన్నది చెలికత్తె మళ్ళీ.

వెంటనే సుకన్యను అంబారీపైనుంచి కిందికి దించారు. వీరసింహుడి ఆజ్ఞ ప్రకారం నిమిషాలలో అక్కడొక గుడారం ఏర్పాటు చేశారు. ఒక దూత జయపురికి వెళ్ళి, ఆస్థాన వైద్యుణ్ణి, ఇద్దరు యువతులనూ వెంటబెట్టుకుని వచ్చాడు. వాళ్ళు

నాకు కావలసిందల్లా ఆ విగ్రహం మీదగ్గరే ఉండడం. పైగా, రక్తపాతం జరగడం నాకు సుతరామూ ఇష్టంలేదు. పైపెచ్చు మనం ఎంతకాదన్నా మహారాజు అంగీకరించరు కదా. అంతేకాదు; చక్కటి యువకుడయిన రాజును పెళ్ళాడడంలో తప్పేమిటి?'' అన్నది సుకన్య.

''శభాష్! చాలా చక్కగా చెప్పావు యువరాణీ!'' అన్నాడు వీరసింహుడు, ఆనందంతో పొంగిపోతూ.

శంకరవర్మ అంగీకార సూచకంగా తల ఊపాడు.

మరుక్షణమే సుకన్యను వీరసింహుడి వెంట పంపడానికి సన్నాహాలు ప్రారంభ

ముగ్గురూ యువరాణి వున్న గుడారంలోకి వెళ్ళి కొంతసేపటికి వెలుపలికి వచ్చి, వీరసింహుడితో, ''మహారాజా! యువరాణి గారు కొంతసేపట్లో కోలుకుంటారు. మరీ నీరసంగా ఉన్నారు. ఆమెకు విశ్రాంతి అవసరం. అయినా, ఏనుగుపై ప్రయాణం మంచిదికాదు. మేనా ఏర్పాటుచేయండి," అని సలహా ఇచ్చి వెళ్ళి పోయారు.

జయపురినుంచి అక్కడికి మేనాను తెప్పించడానికి సాయంకాలమయింది. ఆ తరవాత వీరసింహుడు చెలికత్తెను దగ్గరికి పిలిచి, ''యువరాణి ఇప్పుడు ప్రయాణానికి సిద్ధమే కదా?'' అని అడిగాడు.

''యువరాణిగారు విశ్రాంతి తీసుకుంటున్నారు. తమరే లోపలికి వెళ్ళి అడగవచ్చు కదా!'' అన్నది చెలికత్తె నవ్వుతూ.

వీరసింహుడు పరమానందంతో గుడారంలోపలికి వెళ్ళి చిన్నగా దగ్గుతూ, ''యువరాణీ!'' అని పిలిచాడు. ఏమాత్రం అలికిడిలేదు. అతడు మెల్లగా పడకను సమీపించాడు. మసక వెలుతురులో పడకమీద పట్టు వస్త్రం కదలడం తళుక్కుమన్నది. అది సుకన్య చేయి అనుకుని వీరసింహుడు, దానిని ప్రేమగా తాకుతూ, ''యువరాణీ!'' అన్నాడు మెల్లగా.

ఆ క్షణమే పట్టుబట్టను తొలగించుకుని పైకి వచ్చిన ఒక కోతిపిల్ల, వీరసింహుడి ముఖాన్ని గోళ్ళతో గాయపరిచి, ఒక్క గెంతున బయటకు దూకి పారిపోయింది!

వీరసింహుడు ఒక్క క్షణం అవాక్కయిపోయాడు. ఆశాభంగంతో, అవమాన భారంతో కొంతసేపు అక్కడినుంచి కదలలేకపోయాడు. ఇంతలో ఇక్కడికి కోతిపిల్ల ఎలా వచ్చింది? మళ్ళీ మంత్ర ప్రయోగమా? మాయమంత్రాలతో ఎవరైనా యువరాణిని అమాంతం కోతిపిల్లగా మార్చేశారా? ఒకవేళ అలా జరిగివుంటే కోతిపిల్లను మళ్ళీ యువరాణిగా మార్చడం సాధ్యమే కదా? వీరసింహుడు ఇలా అనుకుంటూ, ''పట్టుకోండి! దానిని పట్టుకోండి!'' అని అరుస్తూ గుడారం నుంచి బయటకు వచ్చాడు. —(ఇంకావుంది)






# కీర్తిచంద్రిక నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలా, శ్రమకు ఓర్చగలశక్తి చూస్తూంటే, నిన్ను అభినందించకుండా వుండలేకపోతున్నాను. అయితే, తీరా కార్యసాఫల్యం అయ్యాక, దాన్ని అవివేక కారణంగానో, అర్థహీనమైన పట్టింపుల వల్లనో చేజేతులా పోగొట్టుకోగలవేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా, కీర్తిచంద్రిక అనే రాకుమారి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

స్వర్ణదీప్తిరాజ్యాన్ని పాలించే విశ్వక్రాంతుడు, ప్రజాభిమానాన్ని చూరగొన్న

## బేతాళ కథలు



లని అతడాలోచిస్తున్న తరుణంలో, కీర్తి చంద్రిక చెలికత్తె ద్వారా అతడికొక విషయం తెలియవచ్చింది. అదేమంటే— కీర్తిచంద్రిక, చంద్రదీప్తుణ్ణి మనసారా ప్రేమించి వున్నది. అతణ్ణి వివాహమాడి తీరాలని నిశ్చయించుకున్నది.

ఈ సంగతి తెలిశాక సూర్యకేతుడు, విశ్వక్రాంతుణ్ణి స్వయంగా కలుసుకుని, "నీ కుమారుణ్ణి నేనెరుగుదును; నా కుమార్తెను నువ్వు చూసే వున్నావు! ఆమెను నీ కోడలుగా చేసుకుని, మన స్నేహాన్ని బంధుత్వంగా మార్చు." అని కోరాడు.

రాజు. అతడికి అజాతశత్రువన్న పేరుండేది. సాటిరాజులు పరిపాలనలో విశ్వక్రాంతుణ్ణి ఆదర్శంగా భావించేవారు.

విశ్వక్రాంతుడికి చంద్రదీప్తుడు ఒక్కడే కొడుకు. అతడు యుక్తవయస్కుడయ్యే నాటికి సద్గుణవంతుడుగా, అంతకుమించి పరాక్రమశాలిగా కీర్తిగాంచాడు. దానితో కుమార్తెలున్న మహారాజులు, అతడిని తమ అల్లుడుగా చేసుకోవాలని ఉవ్విళ్ళూరసాగారు. వారిలో సౌగంధిరాజ్యం రాజు సూర్యకేతుడు ఒకడు.

సూర్యకేతుడు, విశ్వక్రాంతుడికి ఆప్తమిత్రుడు. తన కుమార్తె కీర్తిచంద్రికను, చంద్రదీప్తుడికిచ్చి వివాహం చేయా

స్నేహితుడి కోరిక విన్న విశ్వక్రాంతుడు, ఎంతగానో సంతోషించి, అప్పటికప్పుడు చంద్రదీప్తుడికి కబురంపాడు.

విషయం తెలుసుకున్న చంద్రదీప్తుడు, తండ్రితో, "క్షమించండి! నేను సాగరిక యువరాణి మనోజ్ఞమాలను ప్రేమించాను. ఆమెను పరిణయమాడాలన్నది, నా కోరిక," అన్నాడు.

విశ్వక్రాంతుడు ఒకక్షణం ఆలోచించి, "సరే, వివాహం అనేది, నీ జీవితానికి సంబంధించినది. స్నేహితులమైనమేము, వియ్యంకులం కావాలని ముచ్చటపడ్డాం. దైవలీల ఎలా వుంటే అలాగే జరుగుతుంది, వెళ్ళిరా!" అన్నాడు.

అయితే, సూర్యకేతుడు కల్పించుకుని, చంద్రదీప్తుడితో, "చంద్రా, నా కుమార్తె మనసా, వాచా నిన్నే కోరుకుంటున్నది. ఆమెను కాదనకు," అన్నాడు.

చంద్రదీప్తుడు, సూర్యకేతుడి కోరికను సున్నితంగా తిరస్కరించాడు. అప్పుడు సూర్యకేతుడు, విశ్వక్రాంతుడితో, "చంద్రదీప్తుడు చిన్నవాడు. అనుభవశూన్యుడు. తెలియక మాట్లాడుతున్నాడు. నువ్వు కొంచెం చెప్పి ఒప్పించు," అన్నాడు.



దానికి విశ్వక్రాంతుడు, "వివాహ విషయంలో బలవంతం చేయడం మంచిది కాదు!" అన్నాడు.

"పోనీ మనోజ్ఞమాలతోపాటు, నా కుమార్తెను కూడా వివాహమాడమని, నీ కుమారుడికి ఎందుకు చెప్పకూడదు?" అని అడిగాడు సూర్యకేతుడు అసహనంగా.

తండ్రి జవాబిచ్చేలోపలే చంద్రదీప్తుడు, "క్షమించండి! మా వంశంలోని వారందరూ ఏకపత్నీవ్రతులు," అన్నాడు.

అది వింటూనే సూర్యకేతుడు కోపోద్రిక్తుడై, "ఈ వివాహానికి అంగీకరించని పక్షంలో తీవ్రపరిణామాలను ఎదుర్కోవలసి వస్తుంది!" అని, రథం ఎక్కి తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వారం తిరక్కుండానే సూర్యకేతుడు, విశ్వక్రాంతుడి మీద యుద్ధం ప్రకటించాడు. ధర్మబద్ధంగా మాట్లాడిన తనతో సూర్యకేతుడు యుద్ధానికి సిద్ధపడడం, విశ్వక్రాంతుడి మనసును నొప్పించింది. చేసేదిలేక అతడూ యుద్ధ ప్రయత్నాలు ప్రారంభించాడు.

యుద్ధభూమికి బయలుదేరుతున్న తండ్రితో చంద్రదీప్తుడు, "ఈ యుద్ధానికి కారణం, నేను! నేనే ఆ సూర్యకేతుణ్ణి ఎదుర్కొంటాను. అందువల్ల, నా బల పరాక్రమాలేమిటో, అతడికే కాక సాటి రాజులకూ తెలుస్తుంది," అన్నాడు.

అక్కడ కీర్తిచంద్రికకు, తన తండ్రి విశ్వక్రాంతుడి మీద యుద్ధం ప్రకటించడం, ఏమాత్రం ఇష్టం లేదు. తన

వివాహ సమస్యకోసం ఇరుపక్షాలా ఎందరో సైనికులు బలికాబోవడం, ఆమెకు అమిత మైన విచారాన్ని కలిగించింది.

బాగా ఆలోచించిన మీదట కీర్తిచంద్రికకు, ఒక పరిష్కారమార్గం కనిపించింది. తాను కూడా యుద్ధ విద్యలన్నిటిలో—ముఖ్యంగా ఖడ్గయుద్ధంలో ప్రవీణురాలు. తమ రాజ్యం తరఫున తనూ, స్వర్ణదీప్తి రాజ్యం తరఫున చంద్రదీప్తుడూ—ఇద్దరే యుద్ధం చేస్తారు. తాను ఓడితే చంద్ర దీప్తుడు, మనోజ్ఞమాలను వివాహమాడ తాడు. ఒకవేళ చంద్రదీప్తుడు ఓడితే, అతడు తనను తప్పక వివాహమాడాలి. అయితే, చంద్రదీప్తుడి వంటి మహావీరుణ్ణి, తను ఓడించగలదా ?

ఈ సందేహం కలిగిన సమయంలోనే కీర్తిచంద్రికకు, తమ రాజగురువు మాటలు జ్ఞప్తికి వచ్చాయి. దాపులనున్న దక్షకారణ్యంలో నీలాంబరు డనే మునీశ్వరుడున్నాడు. ఆయన గొప్ప తపశ్శాలి. న్యాయసమ్మతం అని భావిస్తే, ఆయన ఎవరికైనా కోరిన వరం ఇవ్వగలడు.

కీర్తిచంద్రిక గుర్రం మీద బయలుదేరి, అరణ్యంలో వున్న నీలాంబరుడి ఆశ్రమం చేరి, తన సమస్య గురించి ఆయనకు విన్నవించింది. ముని కొంతసేపు ఆలోచించి, "అమ్మా, నీకు ఖడ్గసిద్ధి అనే మంత్రం ఉపదేశిస్తాను. ఆ మంత్రప్రభావం వలన, నీవు ఖడ్గాన్ని ఒక్క క్షణంపాటు మెరుపువేగంతో ఝుళి



పెంచగలవు. ఎంతటి శక్తిమంతుడైనా, ఆ క్షణంలో నీ ధాటికి తట్టుకోలేడు!" అని చెప్పి ఆమె చెవిలో మంత్రం ఉపదేశించాడు.

కీర్తిచంద్రిక, మునికి తన కృతజ్ఞత చెప్పుకుని, రాజప్రాసాదానికి తిరిగి వచ్చింది.

ఆమె ద్వారా సంగతి విన్న సూర్యకేతుడు, "అమ్మా, నువ్వు పురుష వేషంలో చంద్రదీప్తుడితో యుద్ధం చెయ్యి. ఓడిపోయిన అతడికి రాజ్యం ఎరగాచూపి, వివాహానికి ఒప్పిద్దాం," అన్నాడు.

ఆ తర్వాత సూర్యకేతుడు, ఒక దూత ద్వారా విశ్వక్రాంతుడికి, "యుద్ధం పేరుతో ప్రాణనష్టం కలిగించడం, నాకిష్టం లేదు. నా సైన్యంలోని ఒక వీరుడితో, నీ కుమారుడు చంద్రదీప్తుణ్ణి ద్వంద్వయుద్ధం చేయమను. చంద్రదీప్తుడు ఓడితే, మీ రాజ్యం మాదవుతుంది. మా వీరుడు ఓడితే, మా రాజ్యం మీదవుతుంది," అని కబురు పంపాడు.

ఇందుకు విశ్వక్రాంతుడు అంగీకరించాడు. యుద్ధభూమిలో పురుషవేషంలో వున్న కీర్తిచంద్రికా, చంద్రదీప్తుడూ కత్తి యుద్ధానికి తలపడ్డారు. కొంతసేపు యుద్ధం జరిగింది. చంద్రదీప్తుడి కత్తి దెబ్బలు కాచుకోవడం, కీర్తిచంద్రికకు కష్టమైంది. అప్పుడామె ముని ఉపదేశించిన ఖడ్గసిద్ధిమంత్రం స్మరించింది. మరుక్షణం, ఆమె చేతిలోని కత్తి మెరుపు





నా నిర్ణయమేదో మీకు లోగడే తెలియ పరిచాను. ఆ నిర్ణయంలో మార్పులేదు," అన్నాడు.

తండ్రి ద్వారా చంద్రదీప్తుడి అభిప్రాయం తెలుసుకున్న కీర్తిచంద్రిక చాలా నిరుత్సాహపడింది.

సూర్యకేతుడు, చంద్రదీప్తుణ్ణి బందీగా తీసుకుపోయాడన్న సంగతి విన్న, మనోజ్ఞమాల తండ్రి సోమవర్మ, సూర్యకేతుడి మీద యుద్ధం ప్రకటించాడు. ఇది తెలిసిన సూర్యకేతుడు, కుమార్తెతో, "సోమవర్మ యుద్ధప్రకటన గురించి విచారించకు. అతడి సైనికబలం మన ముందు ఎందుకూ కొరగాదు. మన సైన్యాన్ని పంపి, అతణ్ణి సునాయాసంగా ఓడించగలను," అన్నాడు.

ఈ జరిగిన సంఘటనలన్నిటి గురించీ, సుదీర్ఘంగా ఆలోచించిన మీదట కీర్తిచంద్రిక, తండ్రితో, "నాన్నా, నా మనసు మార్చుకున్నాను. చంద్రదీప్తుడి వివాహం మనోజ్ఞమాలతో దగ్గిరవుండి జరిపించ తలచాను," అని చెప్పింది.

సూర్యకేతుడు సరేనన్నట్టు తల ఊపి, మంత్రి ద్వారా విశ్వక్రాంతుడికి లేఖ పంపుతూ, అందులో—నా కుమార్తె మంత్రప్రభావంతో, నీ కుమారుణ్ణి గెలిచిందేకాని, స్వయంశక్తితో కాదు, అందు

వేగంతో కదిలింది. ఒక్కక్షణం చంద్రదీప్తుడికి, ఏం జరుగుతున్నదీ అర్థం కాలేదు. మరుక్షణం అతడి చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది.

సూర్యకేతుడు, చంద్రదీప్తుణ్ణిబంధించి, తన రాజ్యానికి తీసుకుపోయాడు. మర్నాడు అతడు, చంద్రదీప్తుడితో, "ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ద్వంద్వయుద్ధంలో నిన్ను ఓడించినది, పురుషవేషంలో వున్న నా కుమార్తె కీర్తిచంద్రిక. నా అల్లుడివి అయితే, ఆమెతోపాటు నా రాజ్యం కూడా నీదే అవుతుంది," అన్నాడు.

ఇందుకు చంద్రదీప్తుడు, "క్షమించండి, మహారాజా! వివాహ విషయంలో,

వల్ల, నీ కుమారుడి ఓటమిని అంగీకరించ నవసరం లేదు. నీ రాజ్యం నీకే చెందు తుంది, నన్ను క్షమించు! అని వేడు కున్నాడు.

తర్వాత మనోజ్ఞమాలతో, చంద్రదీప్తుడి వివాహం కీర్తిచంద్రిక సమక్షంలో వైభవో పేతంగా జరిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కీర్తిచంద్రిక, చంద్రదీప్తుణ్ణి గాఢంగా ప్రేమించినదన్నదాంట్లో సందేహానికి తావు లేదు. చంద్రదీప్తుడు, ఆమెను తిరస్కరిం చాడు. అయినా కీర్తిచంద్రిక అంతటితో ఊరుకోక, ముని నుంచి మంత్రోపదేశం పొంది అతణ్ణి ఓడించింది. అప్పటికీ చంద్రదీప్తుడు, ఆమెతో వివాహానికి అంగీ కరించలేదు. ఈ దశలో కీర్తిచంద్రిక, అతడిపై కక్షసాధించక, అతడు ప్రేమిం చిన మనోజ్ఞమాలతో దగ్గిరవుండి ఎందుకు వివాహం జరిపించింది? ఇది అవివేకం, అర్థహీనం అనిపించుకోదా? ఈ సందేహా లకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కీర్తిచంద్రిక స్వతహాగా సాత్వికురాలు. యుద్ధంవలన ఎందరో ప్రాణాలు కోల్పోవడం ఇష్టం లేకా, అయినా చంద్రదీప్తుడిపై గల ప్రేమను మరిచిపోలేకా, మునిని ఆశ్ర యించి మంత్రోపదేశం పొందింది. ద్వంద్వ యుద్ధంలో ఓడి, మనోజ్ఞమాల కోసం రాజ్యాన్ని కోల్పోవడానికి కూడా సిద్ధపడిన చంద్రదీప్తుడి ప్రేమ ఎంత బలమైనదో, ఆమె గ్రహించగలిగింది. ఈ పరిస్థితుల్లో స్త్రీ సహజమైన ఓర్పు, త్యాగం ప్రదర్శించి మనోజ్ఞమాలతో, చంద్రదీప్తుడి వివాహం జరిపించింది. అంతేకాని, అవివేకం, అర్థ హీనమైన ఆలోచనలవల్లమాత్రం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]



# అతితెలివి

సోమయ్యకు తన కొడుకు సూర్యం చాలా తెలివైనవాడని నమ్మకం. వాడిని పట్నం తీసుకు పోయి, శివనాధుడనే గురువుకు, చదువు చెప్పమని అప్పగించాడు.

కొన్నాళ్ళ తర్వాత ఏదో పని వుండి సోమయ్య పట్నం వచ్చి, తన కొడుకు చదువు ఎలా సాగుతున్నదో చూడబోయాడు.

శివనాధుడు, సోమయ్యతో, "నీ కొడుకు చాలా అతితెలివిపరుడు, వాడికి చదువు చెప్పడం చాలా కష్టం," అన్నాడు.

అందుకు సోమయ్య ఒప్పుకోక, "నా కొడుకు చాలా తెలివైనవాడు. మీరు వాణ్ణి గురించి తగినంత శ్రద్ధ తీసుకోవడం లేదు," అన్నాడు.

ఈ జవాబు విని శివనాధుడు బాధపడి, సూర్యం తెలివితేటలు ఎలాంటివో సోమయ్యకు అర్థమయ్యేలా చెయ్యాలని వాణ్ణి పిలిపించి, "చూడు సూర్యం, పూర్వం మన దేశంలో ఎంతో మంది గొప్ప చేనేత కళాకారులుండేవారు. వాళ్ళు తయారుచేసిన చీరలను అగ్గిపెట్టెల్లో పెట్ట గలిగేవారట! అర్థమైందా?" అని అడిగాడు.

సూర్యం అర్థమైనదన్నట్టు తల వూపాడు.

"సరే, నేను చెప్పినదాన్నిబట్టి, నీకేం అర్థమైందో చెప్పు," అన్నాడు శివనాధుడు.

"ఆ కాలంలో అగ్గిపెట్టెల్ని చాలా పెద్దవిగా—అంటే చీరలు పట్టే పరిమాణంలో తయారు చేసేవాళ్ళన్నమాట," అన్నాడు సూర్యం తడుముకోకుండా.

దానితో సోమయ్యకు తెలివికీ, అతితెలివికీ తేడా తెలిసివచ్చింది. ఆయన శివనాధుణ్ణి తన తొందరపాటుకు క్షమించమని అడిగి, ఎలాగైనా తన కొడుకును సరిఅయిన మార్గంలో పెట్టమని కోరుకుని వెళ్ళిపోయాడు.

—దాసరి వెంకటరమణ



## చందమామ అనుబంధం—26

## మహనీయులు కలలుగన్న భారతదేశం:



### త్యాగనిరతి!

భారత జాతీయోద్యమ నాయకులలో ప్రముఖుడయిన బిపిన్‌చంద్ర పాల్ (1858–1932), ప్రస్తుతం బంగ్లాదేశ్‌లో వున్న సైెల్‌లో జన్మించాడు. సహాయ నిరాకరణోద్యమానికి పిలుపు నిచ్చి, ఆయన బ్రిటిష్ పాలకులచేత నానాహింసలకు గురయ్యాడు. దేశ స్వాతంత్ర్యం కోసం, అభ్యుదయం కోసం పాటుపడిన బిపిన్‌చంద్ర పాల్ గొప్ప వక్త. జాతీయోద్యమ కాలఘట్టంలో దేశమంతటా నూతనోత్తేజం వికసిస్తున్నట్టు కలలుగన్న ఆ మహనీయుడు ఇలా అన్నాడు: “దేశం గళమెత్తి అందరినీ ఆహ్వానిస్తోంది. పవిత్రలక్ష్యాన్ని సాధించడానికి కవులనూ పండితులనూ, తత్వవేత్తలనూ ప్రవక్తలనూ, నాయకులనూ సాధారణ ప్రజలనూ, అందరినీ ఆహ్వానిస్తోంది. ఆ ఆహ్వానాన్ని అందుకుని మనం అందరం ఆత్మత్యాగానికి సిద్ధం కావాలి. దేశం కోసం కేవలం తీరిక సమయాలనూ, మిగులుధనాన్నీ వినియోగించినంత మాత్రాన సరిపోదు. కష్టార్జితమైన తమ సర్వస్వాన్ని మాతృదేశం కోసం సమర్పించగల త్యాగమూర్తులు కావాలి!”

ఆ మహానుభావుడు ఆశించిన దేశభక్తి, త్యాగనిరతి మనం అలవరచుకున్నామా? ఆ దేశభక్తుడు కన్న కలలు ఎంతవరకు ఫలించాయి? ఆలోచించి చూడాలి మరి!

## మీకు తెలుసా?

1. మొట్టమొదటి గుండెమార్పిడి శస్త్రచికిత్స చేసిన వారెవరు?
2. గుండెమార్పిడి పొందిన వారెవరు?
3. ఏసుక్రీస్తు శిలువ వేయబడినప్పటి రోమన్ చక్రవర్తి ఎవరు?
4. కోతులలో చాలా పెద్దరకం జాతి పేరేమిటి?
5. తన కెలాంటి దైవశక్తి లేదని చాటిన 20వ శతాబ్దపు చక్రవర్తి ఎవరు?
6. ఆయన ఏ సందర్భంలో అలా చెప్పాడు?

(36వ పేజీ చూడండి)

# బ్రహ్మ

చతుర్ముఖుడయిన బ్రహ్మ, సృష్ట్యాదిలో మహావిష్ణువు నాభినుంచి పుట్టిన కమలం నుంచి ఆవిర్భవించాడు. సృష్టిచేయగల దివ్యశక్తితో జన్మించిన బ్రహ్మతోనే వెలుగూ, ప్రణవనాదమయిన 'ఓంకారమూ' పుట్టాయని చెబుతారు!

చరాచరాత్మకమైన ప్రపంచంతో పాటు, బ్రహ్మ ఎందరో మునిశ్రేష్ఠులనూ, శక్తి సంపన్నులయిన ప్రజాపతులనూ సృష్టించాడు. వారిలో మరీచి, అత్రి, అంగిరసుడు, పులహుడు, పులస్త్యుడు, క్రతువు, వసిష్ఠుడు, భృగువు, దక్షుడు, నారదుడు అనే పదుగురు సుప్రసిద్ధులు.

సృష్టి కంతటికీ పితామహుడు కావడం వల్ల, బ్రహ్మకు అందరిపట్లా సమానమైన ప్రేమానురాగాలు. అందువల్లే బ్రహ్మ నుంచి దుర్మార్గులయిన రాక్షసులు సైతం గొప్ప గొప్ప వరాలు పొందినట్టు పురాణగాథలు చెబుతున్నాయి!

ఆది కవి వాల్మీకి నోట ప్రథమ శ్లోకం పలకడానికీ, వేదవ్యాసుడు వేదాలను విభజించి లోకక్షేమం కలిగించడానికీ బ్రహ్మదేవుడే ప్రేరణ కలిగించాడట! చదువుల తల్లి సరస్వతి బ్రహ్మదేవుడి భార్య.



# చందమామ కబుర్లు



## ఎవరెస్టును అధిరోహించిన అతిపిన్న వయస్కుడు!

ఫ్రాన్స్‌కు చెందిన బెర్ట్రండ్ రోష్ అనే పదిహేడేళ్ళ యువకుడు ఇటీవల ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించాడు. ప్రపంచంలో కెల్లా ఎత్తయిన ఆ శిఖరాన్ని అధిరోహించిన వారిలో ఈ యువకుడే అతిపిన్న వయస్కుడు. పర్వతారోహణకు అతనితో పాటు బయలుదేరిన అతని మిత్రుడు ఒంటికాలి వెసల్ బిషనాయిస్ కి విజయావకాశం కొద్దిలో తప్పిపోయింది.




## పెరుగుతూన్న అపాయం!

భూమి మీది నదులనూ, సముద్రాలనూ కలుషితం చేస్తూ ఈనాటి మానవుడు వాతావరణాన్ని చేజేతులా నాశపరచుకుంటున్నాడు. భూమి మీద చాలదని ఈ అపాయం ప్రస్తుతం వ్యోమ వీధికి వ్యాపిస్తున్నది. పాత రాకెట్ల శకలాలు భూమిచుట్టూ తిరుగుతున్నాయి. అవి సక్రమంగా పని చేస్తున్న 'స్పేస్ క్రాఫ్ట్'లకు ఢీకొన్నట్టయితే దారుణమైన పర్యవసానాలు ఏర్పడవచ్చు!



# సాహిత్యావలోకనం

1. భారతదేశంలో జరిగిన సిపాయిలకలహం సంఘటనలను ప్రత్యక్షంగా చూసి తెలియజేసిన ఇంగ్లీషు పాత్రికేయుడు ఎవరు ?

2. ఆయన ఏ పత్రికకు చెందిన వాడు ?

3. వాల్టేర్ రచించిన వ్యంగ్య ప్రధానమైన సుప్రసిద్ధ నవల ఏది ?

4. 2,200 నాటకాలు రచించిన నాటకకర్త ఎవరు ?

5. బౌద్ధుల పవిత్రగ్రంథాలు ఏ భాషలో రచింపబడ్డాయి ?

## సమాధానాలు

మీకు తెలుసా ?

1. డా॥ క్రిస్టియన్ బెర్నార్డ్
2. లూయి వాష్కాన్ స్కీ
3. సైబీరియన్
4. మాంద్రిల్
5. జపాన్ చక్రవర్తి హిరోహిటో
6. రెండవ ప్రపంచ యుద్ధంలో జపాను ఓటమి సందర్భంగా.

సాహిత్యం

1. విలియం హోవార్డ్ రస్సెల్
2. లండనుకు చెందిన 'ది టైమ్స్'
3. కాండైడ్
4. స్పెయిన్‌కు చెందిన లోప్ డీ వేగా
5. పాలీ



ప్రపంచ పురాణగాథలు-1

# థీబ్స్‌నగర నిర్మాణం

టైర్‌యువరాజు కేడ్మస్‌కు జ్యోతిష్కులు భవిష్యత్తును గురించి తెలియజేస్తూ, కొన్ని విశిష్టచిహ్నాలతో ఒక ఆవు కనిపిస్తుందనీ, ఆ ఆవు వెంట వెళ్ళి అది పడుకునేచోట నగర నిర్మాణం జరపడం శుభప్రదమనీ చెప్పారు. కొన్నాళ్ళ తరవాత, వాళ్ళు చెప్పినట్టుగానే కేడ్మస్‌కు ఒక ఆవు కనిపించింది. ఆయన దానిని వెంబడించి వెళ్ళాడు.

ఆవు అరణ్యంలో ప్రవేశించి, చాలా దూరం వెళ్ళి ఒకచోట పడుకున్నది. ఆవు పడుకున్న స్థలం కేంద్రంగా నగరం నిర్మించాలన్న సంకల్పంతో కేడ్మస్ ఆ చోటును గుర్తుంచుకుని రాజధానికి తిరిగి వెళ్ళాడు.





ఆ తరవాత ఆయన కొంతమంది అనుచరులను వెంటబెట్టుకుని మళ్ళీ అరణ్యమధ్యానికి వచ్చాడు. ఆవు పడుకున్న స్థలంలో నగర నిర్మాణం ప్రారంభించడానికి ముందు, ఆ చుట్టుపక్కల తాగడానికి మంచినీరు లభిస్తుందేమో తెలుసుకోమని తన అనుచరులను ఆజ్ఞాపించాడు.



ఆయన అనుచరులు నలుదిశలా తిరిగి చూసి, ఒకచోట గంభీరధ్వనితో ప్రవహించే జలపాతాన్ని కనుగొన్నారు. వాళ్ళు ఉత్సాహంతో అక్కడికి చేరి జలపాతం లోని నీటిని తాగడానికి దోసిళ్ళలోకి తీసుకున్నారు. మరుక్షణమే జలపాతం చాటు నుంచి ఒక భయంకర మృగం బయటకు దూకింది!

దాని బారినుంచి తప్పించుకోవడానికి వాళ్ళు ఎంతో ప్రయత్నించారు. కాని, ఆ భయంకరమృగం వాళ్ళందరినీ చంపేసింది. వారి చావుకేకలు విని కేడ్మస్ అక్కడికి చేరాడు.





కేడ్మస్, ఎథీనా దేవతను ప్రార్థించి, ఆమె ఆశీస్సులు పొంది, కత్తి దూసి భయంకర మృగంతో కలయబడి, చాలా సేపు భీకరంగా పోరాడి దానిని హత మార్చాడు.

ఆ తరవాత దేవత ఆజ్ఞానుసారం, కేడ్మస్ ఆ భయంకర మృగం నోటి నుంచి అక్కడ చెల్లాచెదరుగా రాలి పడిన కోరలను ఏరి తీసి ఒకచోట పాతి పెట్టాడు.





పాతిపెట్టిన ఆ జంతువు కోరల నుంచి హఠాత్తుగా భీకరాకారులయిన సైనికులు కత్తులు దూస్తూ పుట్టుకువచ్చారు. కేడ్మస్ చటుక్కున ఒక బండచాటుకు తప్పుకుని దాక్కున్నాడు.

కొంతసేపయ్యాక కేడ్మస్, బండచాటు నుంచి, ఒక రాయిని తీసి సైనికుల మధ్యకు విసిరాడు. దానిని ఎవరు విసిరారో తెలుసుకోలేక సైనికులు, "నువ్వు విసిరావు!" "కాదు నువ్వే విసిరావు," అని తమలో తాము కలహించుకోసాగారు.





అలా కొంతసేపు ఒకరినొకరు మూర్ఖంగా నిందించుకుని, ఆ తరవాత పట్టరాని ఆగ్రహావేశాలతో ఒకరినొకరు దారుణంగా చంపుకోసాగారు!

అఖరికి అందరూ చావగా వాళ్ళలో ఐదుగురు మాత్రమే మిగిలారు. కేడ్మస్ బండచాటునుంచి బయటకు వచ్చాడు. ఆ ఐదుగురూ కేడ్మస్‌ను తమ నాయకుడుగా స్వీకరించి, నగర నిర్మాణానికి సహాయపడగలమని మాట ఇచ్చారు. కేడ్మస్ చాలా సంతోషించాడు.





గ్రీసులోని థీబ్స్‌నగర నిర్మాణం అలాగే జరిగింది. నగర నిర్మాణానికి సహాయపడిన ఐదుగురు వీరులే థీబ్స్ నగరంలోని ఐదు ఉన్నత కుటుంబాలకు ఆద్యులయ్యారు. కొన్ని శతాబ్దాల తరవాత అలెగ్జాండర్ చక్రవర్తి ఆ నగరాన్ని నాశపరిచాడు. ఆ ప్రాంతాన్ని ప్రస్తుతం థీవాయ్ అంటారు.




# వరహాల దానం

సీనయ్య పరమ పిసినారి. ఒక రోజున ఆయన పొరుగూరు వెళ్ళి అడవిమార్గాన తిరిగి వస్తూండగా, ఒక చెట్టుకింద నీరసంగా మూలుగుతున్న ముసలివాడు కనిపించాడు. వాడు సీనయ్యను చూసి, ''అయ్యా! ముసలివాణ్ణి దాహంతో నాలుక పిడచకట్టుకుపోతున్నది. ఇన్ని నీళ్ళు పోసి ప్రాణాన్ని నిలబెట్టండి,'' అన్నాడు.

సీనయ్య వాణ్ణి సమీపించి, ''నేను పిసినారినని అంతా చెప్పుకుంటారు. నా దగ్గిర మంచినీళ్ళున్నాయి కానీ, ప్రయోజనం లేనిదే, నేనేపనీ చేయను. నీ దగ్గిర డబ్బుంటే చెప్పు. ప్రతిఫలం తీసుకుని నీ ప్రాణాలు నిలబెడతాను,'' అన్నాడు.

ముసలివాడు తనదొండినవున్న వెండి నాణేన్ని తీసి సీనయ్యకిచ్చి, ఆయన ఇచ్చిన మంచి నీళ్ళు తాగి, ''ఇప్పుడు ప్రాణం లేచివచ్చినట్లుంది. నీ మేలు మరిచిపోలేను. నీతో మీ ఊరు వచ్చి నీ సాయానికి ప్రతిఫలంగా ఏదైనా ఇచ్చుకుని వెళతాను,'' అన్నాడు.

''చూడబోతే పేదవాడివిలా వున్నావు. తెలివి కూడా అంతంతమాత్రంగానే వున్నది. లేకపోతే ప్రాణం పోతున్నాసరే, మంచినీళ్ళకు వెండికాసు వృథా చేస్తావా? నీవంటివాడి వల్ల, నాకే ప్రయోజనమూ వుండదు. వెళ్ళు, వెళ్ళు!'' అన్నాడు సీనయ్య.

దానికి ముసలివాడు, ''నన్ను తక్కువగా అంచనా వెయ్యకు. నీతోవచ్చి, నీ ఇంటిముందు నిలబడి దానం చేయమని అడుగుతాను. నాకొక వరహా ఇవ్వు. దానం చేసిన పుణ్యం నీకెన్నిరెట్ల వరహాలు తిరిగి ఇస్తుందో చూద్దువుగాని,'' అన్నాడు.

''వరహామాట అట్లా వుంచు. నీకు ఒక్క రాగినాణెం కూడా దానం ఇవ్వను.



నాకీ పుణ్యపాపాలమీద నమ్మకం లేదు,'' అన్నాడు సీనయ్య.

''నేను చెప్పేది పూర్తిగా వినకుండా కంగారుపడతావేం? నాకు దానం చేస్తే, అది వెయ్యిరెట్లయి వెనక్కుతిరిగి వస్తుం దని చెబుతాను! నా మాట విని నువ్వు, నాకు దానం చేశావంటే ఊళ్ళో గొప్ప వాళ్ళందరు కూడా, నాలో ఏదైనా మహిమ వున్నదనుకుని నమ్మి దానం చేస్తారు. అలా నెల రోజులు చేయాలంటాను. ప్రతిఫలంగా రోజూ నీకు వెయ్యివరహా లిచ్చుకుంటాను,'' అన్నాడు ముసలివాడు.

''వెయ్యివరహాలు ఇవ్వడంవరకూ బాగానే వున్నది. కానీ నువ్వు నన్ను మోసం చేస్తే, నా వరహా పోయినట్లే గదా!'' అన్నాడు సీనయ్య.

''నీకంత అనుమానంగా వుంటే, ఇదిగో ఈ వరహా నీకిస్తున్నాను. ఇదే రేపు నువ్వు నాకు దానంగా ఇద్దువుగాని,'' అన్నాడు ముసలివాడు.

సీనయ్య మారుమాట్లాడకుండా, ముసలి వాణ్ణి తనతోపాటు ఊరిలోకి రానిచ్చాడు. మర్నాడు అంతా అనుకున్నట్లే జరిగింది. సీనయ్య దానమిచ్చాడన్న వార్త కార్చిచ్చులా ఊరంతా వ్యాపించింది. సీనయ్య వంటి పిసినిగొట్టు వరహా దానంగా ఇచ్చాడంటే, ఆ ముసలివాడిలో ఏదో పెద్ద విశేషముంటుందని నమ్మి ఊళ్ళోని వ్యాపారస్థులూ, భాగ్యవంతులూ మాత్రమే గాక, అంతో ఇంతో వున్న ప్రతి ఒక్కరూ, ముసలివాణ్ణి వెతుక్కుంటూ వెళ్ళి వరహా చొప్పున దానం చేశారు.

ఈ విధంగా మొదటి రోజునే ముసలి వాడికి పదివేల వరహాలు లభించాయి. వాడు సీనయ్య ఇంటికి వెళ్ళి, ఆయనకు వెయ్యి వరహాలిచ్చి, ''రేపు కూడా ఇదే విధంగా దానం చేయాలిసుమా, మరిచి పోయేవు!'' అని హెచ్చరించాడు.

''ఈ వెయ్యి వరహాలూ నాకు ఇస్తానని ముందే మాట ఇచ్చావు. అంటే—ఇవి నావి! మరి రేపు దానం చేస్తే ఆ వరహా

పుచ్చుకుని నువ్వు మళ్ళీ కనిపించకుండా పోతే ?" అన్నాడు సీనయ్య.

ముసలివాడు మారుమాట్లాడకుండా, తనకు దానం చేయడానికి సీనయ్యకు వరహా ఇచ్చుకుని వెళ్ళిపోయాడు.

అలా రెండు వారాలు జరిగేసరికి సీనయ్య కిచ్చేదిపోగా, లక్ష వరహాలకు పైగా ముసలివాడి వద్ద చేరాయి. ఆ డబ్బుతో వాడు మంచి ఇల్లు కొనుక్కున్నాడు. ఇద్దరు పనివాళ్ళను పెట్టుకున్నాడు. తన దగ్గిర వున్న డబ్బుతో వడ్డీవ్యాపారం చేస్తూనే, వాడు రోజూ సీనయ్య దగ్గిర వరహా దానం కూడా పుచ్చుకుంటున్నాడు.



ఊళ్ళో ముసలివాడికి దానం చేస్తున్న వాళ్ళందరూ ఇది గమనించారు. వాళ్ళు ఒక మనిషికి సంగతి చెప్పి, ముసలివాడు ఏమేం చేస్తూంటాడో రహస్యంగా ఆరా తీయమన్నారు. ఒకటి, రెండు రోజుల్లోనే వాళ్ళకు నిజం తెలిసిపోయి న్యాయాధికారికి ఫిర్యాదు చేశారు. న్యాయాధికారి సీనయ్యనూ, ముసలివాణ్ణీ, ఫిర్యాదు చేసినవాళ్ళనూ ఒకచోట చేర్చి—ముసలివాణ్ణి సంజాయిషీ అడిగాడు.

అందుకు ముసలివాడు ఏమాత్రం తొణక్కుండా, "అయ్యా, ఇందులో సీనయ్య చేసిన మోసం ఏమీ లేదు. ఆయన నన్ను నమ్మి దానం ఇచ్చాడు. నాకు దానాలిచ్చిన మిగతావాళ్ళకు నేనెలాంటి వాగ్దానమూ చెయ్యలేదు. వాళ్ళే వెతుక్కుంటూ వచ్చి మరీ నాకు దానాలు చేశారు. ఆ విధంగా నా దగ్గిర చాలా ధనం చేరింది. దానం తీసుకోవడం తప్పు కాదుగదా! నావల్ల ఈ ఊరిలో ఏ కుటుంబమూ పదిహేను వరహాలకు మించి నష్టపోలేదు. కాబట్టి నేనెవరినీ పెద్ద ఎత్తున మోసగించలేదు. సీనయ్య దానంవల్ల నేను బాగుపడ్డాను. దానికి ప్రతిఫలంగా ఆయనకు రోజూ వెయ్యి వరహాలిచ్చుకుంటున్నాను," అన్నాడు.

"ఇదంతా కట్టుకథ. సీనయ్యా, ఈ ముసలివాడూ కలిసి తెలివిగా ఉపాయం

పన్ని మమ్మల్ని మోసం చేశారు. వీళ్ళ నిలా వదిలిపెడితే ఊరూరా తిరిగి ఇలాగే అందర్నీ మోసగిస్తారు. అందువల్ల వీళ్ళ ఇద్దరికీ తగినశిక్ష విధించండి,'' అన్నారు ఫిర్యాదు చేసినవాళ్ళు.

అప్పుడు ముసలివాడు చేతులు జోడించి న్యాయాధికారితో, "అయ్యా, ఈ ఉపాయం పాతికేళ్ళ వయసులో నాకు తట్టింది. ఈ ఉపాయాన్నే నమ్ముకుని ఊరూరా తిరిగాను. నా జీవితమంతా వృథాగా గడిచి నేను ముసలివాణ్ణయిపోయాను తప్ప, ప్రయోజనం కనిపించలేదు,'' అన్నాడు.

''నీ మాటలు నమ్మతగ్గవిగా లేవు. ఈ ఊళ్ళో ఫలించిన నీ ఉపాయం, మరెక్కడా ఎందుకు ఫలించలేదు?'' అని ప్రశ్నించాడు న్యాయాధికారి.

''ఏ ఊళ్ళో చూసినా, సీనయ్య వంటి పిసినిగొట్టును నాలుగు తిట్టి దూరంగా వుంచేవారే తప్ప, ఆయన మార్గాన్ని అనుసరించి ప్రయోజనం పొందాలనుకున్న వాళ్ళు కనబడలేదు. అందువల్లనే, ఈనాటివరకూ నా ఉపాయం ఫలించలేదు. ఈ ఊళ్ళో సీనయ్య గొప్పతనాన్ని మెచ్చుకుని, ఆయన చేసినట్లు చేయాలనుకునేవాళ్ళు, కనీసం పదివేలమంది వున్నారు. ఆ కారణంగానే నా ఉపాయం విజయవంతమైంది. నాకు తెలిసినంతలో, ఇలాంటి ఊరు ప్రపంచంలో మరెక్కడా లేదు,'' అన్నాడు ముసలివాడు.

తెలివితేటలతో తమలోని స్వార్థపరత్వాన్ని ఎత్తిచూపించిన, ఆ ముసలివాణ్ణి చూడలేక ఫిర్యాదు చేసినవాళ్ళందరూ సిగ్గుతో తలలు వంచుకున్నారు. ముసలివాడి ఉపాయం ఫలించిందంటే, అందుక్కారణం వాడి తప్పుకాదనీ, తమ స్వార్థపరత్వమనీ వాళ్ళకు అర్థమయింది.

సీనయ్యకూడా పదిమందిలో తన వంటివాడి స్థానమేమిటో, ముసలివాడు చెప్పిన తర్వాతే తెలిసివచ్చింది.

ఆ తర్వాత ఆ ఊరుకు మోసగాళ్ళు వచ్చారేమో కానీ, ఆ ఊళ్ళో మరి పిసినిగొట్టులు మాత్రం పుట్టలేదు.






రాముడు చెప్పిన ప్రకారం లక్ష్మణుడు కిష్కింధకు బయలుదేరి వెళ్ళాడు. అతను భుజానికి విల్లు తగిలించుకుని, సుగ్రీవుడి ఇంటికి పోతూ, తాను సుగ్రీవుడితో ఏమనాలో, దానికి సుగ్రీవుడేమంటాడో, అందుకు తాను ఏమి బదులు చెప్పాలో ఆలోచించుకున్నాడు. లోపల అతనికి చాలా కోపంగా ఉన్నది.

లక్ష్మణుణ్ణి దూరాన చూసి వానరులు, ఎవరో శత్రువు వస్తున్నాడనుకుని, చెట్లూ, రాళ్ళూ తీసుకుని యుద్ధానికి సిద్ధమయ్యారు. దీనిమూలంగా లక్ష్మణుడి కోపం మరింత అయింది. అతని ముఖంలో కోపం తాండవించటం చూసి, వానరులు భయపడి, సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, లక్ష్మణుడు వస్తున్నట్టు చెప్పారు. కాని సుగ్రీవుడు తన భార్యతో సరసాలాడుతూ వాళ్ళు చెప్పినది వినిపించుకోలేదు.

అంగదుడు మాత్రం భయంభయంగా లక్ష్మణుడికి ఎదురు వెళ్ళాడు. లక్ష్మణుడు అతనితో, ''అబ్బాయీ, నేను వచ్చానని సుగ్రీవుడితో చెప్పు. మా అన్న చాలా దుఃఖంలో ఉండటం మూలాన నేను వచ్చానని చెప్పు; వెంటనే నా దగ్గిరకు వచ్చి, నేను చెప్పేది వినమను.'' అన్నాడు.

అంగదుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి లక్ష్మణుడు మాట్లాడటానికి వచ్చాడనీ, చాలా కోపంగా ఉన్నాడనీ చెప్పాడు. అది విని సుగ్రీవుడు తన మంత్రులతో,

7. సుగ్రీవుడి సహాయం



అప్పుడు బుద్ధిమంతుడైన హనుమంతుడు. మిగిలిన మంత్రుల సమక్షంలో సుగ్రీవుడితో, ''రాజా, నువ్వు రాముడి మేలు మరవక పోవటం సహజమే. ఏమరుపాటులో నువ్వు కాలగతి గమనించ లేదు. శరదృతువు వచ్చేసింది. యుద్ధ ప్రయత్నాలకు ఇదే సమయం. అందుకే లక్ష్మణుడు వచ్చి ఉంటాడు. భార్యను పోగొట్టుకున్న దుఃఖంలో రాముడు లక్ష్మణుడి చేత కటువుగా మాట్లాడించినప్పటికీ నువ్వు సహించాలి. కర్తవ్యం మరచి అపచారం చేశావు గనక, లక్ష్మణుణ్ణి మంచి చేసుకోవటం తప్ప మరొక మార్గం ఉన్నట్టు నాకు తోచదు. మంత్రిగా నీ హితం కోరి చెప్పాను. నువ్వు నీ కొడుకునూ, బంధువర్గాన్నీ వెంట బెట్టుకుని లక్ష్మణుడి వద్దకు వెళ్ళి, వినయంగా నమస్కరించి, అతను చెప్పినట్టు చెయ్యి. అప్పుడు లక్ష్మణుడి కోపం తప్పక చల్లారి పోతుంది,'' అన్నాడు.

''నేను ఏమి పొరబాటు మాట అనలేదు; తప్పు పని చెయ్యలేదు. లక్ష్మణుడికి నా పైన కోపం ఎందుకు కలిగి ఉంటుంది? నా శత్రువులు నా మీద అతనికి ఏదో చాడీలు చెప్పి ఉంటారు. నేను భయపడుతున్నాననుకోకండి. నాకు రాముడన్నా, లక్ష్మణుడన్నా ఏమీ భయంలేదు. కాకపోతే, స్నేహితులైన వాళ్ళకు నిష్కారణంగా కోపం వస్తే ఎవరికైనా కొంచెం బాధగానే ఉంటుంది. నాకు భయమల్లా దేనికంటే, రాముడు నాకు చేసిన ఉపకారానికి తగిన ప్రత్యుపకారం చెయ్యలేనేమో అని. ఇది నాకు విచారం కలిగిస్తున్నది,'' అన్నాడు.

అంగదుడు లక్ష్మణుణ్ణి తీసుకు వచ్చాడు. లక్ష్మణుడు కిష్కింధలో వానర ప్రముఖుల ఇళ్ళన్నీ చూస్తూ, సుగ్రీవుడి గృహం ప్రవేశించాడు. ఆ ఇల్లు ఇంద్ర భవనం లాగున్నది. సుగ్రీవుడి అంతఃపురంలో మనోహరమైన వీణా వాద్యం వినబడుతున్నది. అమిత సౌందర్య



వతులైన స్త్రీలు అనేకమంది ఉన్నారు. సుగ్రీవుడు గొప్ప భోగపురుషుడిలాగా జీవిస్తున్నట్టు స్పష్టమయింది. లక్ష్మణుడు పట్టరానికోపంతో; తన వింటి నారి లాగి పెద్ద ధ్వని చేశాడు.

ఆ ధ్వని వినగానే సుగ్రీవుడికి లక్ష్మణుడు వచ్చినట్టు తెలియటమేగాక గుండె కూడా దడదడలాడింది. నోరు ఎండుకుపోయింది. అతను తారతో, ''తారా, ఈ లక్ష్మణుడు చాలా మెత్తనివాడు గదా. అతనికి ఇప్పుడు కోపం ఎందుకు వచ్చిందంటావు? నేను ఇతనికి చెయ్యరాని పని ఏదన్నా చేశానా? ఎందుకైనా మంచిది. నువ్వు ముందు వెళ్ళి, అతన్ని ప్రసన్నుణ్ణి చెయ్యి. తరవాత నేను వస్తాను,'' అన్నాడు.

తార లక్ష్మణుడివద్దకువచ్చి, "లక్ష్మణా, స్నేహితుడైన సుగ్రీవుడి మీద ఇంతగా అలగవచ్చునా? అతనికి మీ పని చూడాలనే ఉన్నది. కొంచెం జాప్యం చేశాడు. నీ వంటి మహాపురుషుడు అల్పుడి మీద ఆగ్రహించరాదు. నువ్వు సుగ్రీవుణ్ణి క్షమించు,'' అన్నది.

ఆమె లక్ష్మణుణ్ణి లోపలికి తీసుకుపోయింది. సుగ్రీవుడు మహావైభవంగా ఆభరణాలూ, పుష్పమాలలూ ధరించి వెలిగిపోతూ బంగారు సింహాసనం మీద కూర్చుని ఉన్నాడు. అతనిచుట్టూ అనేకమంది అప్సరసలలాటి స్త్రీలున్నారు. ఆ దృశ్యం చూస్తూనే లక్ష్మణుడు మహాకోపంతో కాలరుద్రుడిలాగా అయిపోయాడు.

లక్ష్మణుణ్ణి చూడగానే సుగ్రీవుడు భయపడి ఆసనం దిగి, కింద నిలబడ్డాడు. అతనితోబాటు స్త్రీలందరూ లేచి నిలుచున్నారు.

తనకు నమస్కారం చేస్తూ తల వంచుకుని నిలబడిన సుగ్రీవుడితో లక్ష్మణుడు ఇలా అన్నాడు:

''రాముడి చేత నీ పని తీరిపోయినాక నువ్వు రాముడి పని చూడవద్దా? కృత

ఘ్నుడివి, అసత్యవాదివి! సీత కోసం ఎందుకు వెదికించావు కావు? నీవు ఇలాటి వాడివని తెలిస్తే రాముడు నిన్ను వానర రాజుగా చేస్తాడా? నిన్ను ఈక్షణమే నా బాణాలతో వాలి దగ్గిరికి పంపేస్తాను.''



తార మళ్ళీ సుగ్రీవుణ్ణి సమర్థిస్తూ, ''లక్ష్మణా, సుగ్రీవుడు ద్రోహీ, దుర్మార్గుడూ, కృతఘ్నుడూ కాడు. చాలా కాలం అనేక కష్టాలకోర్చి అతను ఇప్పుడు సుఖలాలసలో ఉంటే, మిత్రుడివైన నువ్వు క్షమించవచ్చు. రాముడికోసం సుగ్రీవుడు నన్నూ, రుమనూ, తన సమస్తాన్నీ వదిలిపెట్టగలడు. సీతను రాముడికి తెచ్చి ఇయ్యగలడు. అందుకై రావణుడితో యుద్ధం చెయ్యగలడు. మీ పని మీదనే అతను వానరుల కందరికీ కబురు చేసి ఉన్నాడు. వాళ్ళు రావలసి ఉన్నది. ఇవాళే వాళ్ళు వచ్చే రోజు. అందుచేత నువ్వు కోపం మాని శాంతించు,'' అన్నది.

ఈ మాటలతో లక్ష్మణుడు మెత్తబడ్డాడు. అది చూసి మనసు స్థిమితపడి, సుగ్రీవుడు లక్ష్మణుడితో, ''లక్ష్మణా, నావల్ల కొంచెం జాప్యం జరిగి ఉంటే క్షమించు. లోకంలో తప్పు చెయ్యనివాడెవడు?'' అన్నాడు.

లక్ష్మణుడు అతన్ని మెచ్చుకుంటూ, ''రావణుడితో యుద్ధం చెయ్యటానికి నీ సహాయం ఉంటే అంతకన్న మాకు కావలసినదేమిటి? నువ్వు ఇప్పుడే నావెంట వచ్చి, భార్య కోసం తపిస్తున్న రాముణ్ణి ఓదార్చు,'' అన్నాడు.

సుగ్రీవుడు తన పక్కనే ఉన్న హనుమంతుడితో ఇలా అన్నాడు:

''ప్రపంచంలో ఉండే వానరులనందరినీ పిలవటానికి దూతలను పంపించు. నేను ముందు పంపిన దూతలను తొందర పెట్టించు. వెళ్ళటానికి బద్ధకించే సోమరిపోతులను నా వద్దకు పంపు. పది రోజుల లోపల ఇక్కడ చేరని వానరులకు మరణ దండన ప్రకటించు.''

హనుమంతుడు సుగ్రీవుడి ఆజ్ఞ ప్రకారం అప్పటికప్పుడే కిష్కింధలో ఉండే వానరులనందరినీ అన్ని దిక్కులకూ పంపించాడు.

సుగ్రీవుడు ఒక బంగారు పల్లకి తెప్పించి, అందులో తనతోబాటు లక్ష్మణుణ్ణి ఎక్కించుకుని, వానర పరివారాన్ని వెంటబెట్టుకుని, మహా వైభవంగా రాముడున్న చోటికి వచ్చాడు. సుగ్రీవుడు లక్ష్మణుడితో సహా పల్లకి దిగి, చేతులు మోడ్చి నిలబడ్డాడు. తరవాత అతను తన కాళ్ళకు సాష్టాంగపడితే, రాముడు అతన్ని ప్రేమగా లేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు. తరవాత అందరూ కూర్చున్నారు.

రాముడు సుగ్రీవుడికి, యుద్ధకాలం ఆసన్నమయిందని జ్ఞాపకం చేశాడు.

"రామా, వీరాధివీరులైన వానరులు కోట్ల సంఖ్యలో నీకు సహాయపడటానికి వస్తున్నారు. రావణుణ్ణి సకుటుంబంగా చంపి సీతను వాళ్ళు నీకు అప్పగిస్తారు," అన్నాడు సుగ్రీవుడు.

తన కోసం సుగ్రీవుడు సాగించిన చర్యలు తెలుసుకుని రాముడు ఎంతగానో సంతోషించి, "సుగ్రీవా, నీ సహాయంతో నేను తప్పక శత్రువును చంపగలను," అన్నాడు.

ఇదే సమయంలో ఆకాశంలో చాలా ఎత్తుకు ధూళి లేచింది. వానరమూకలు వచ్చి చేరుతున్నాయి. నదీతీరాలలోనూ,



సముద్రతీరానా, కొండలలోనూ నివసించే వానరులు కోట్ల సంఖ్యలో వస్తున్నారు. కొందరు ఎర్రగా ఉన్నారు. కొందరు తెల్లగా ఉన్నారు. కొందరు బూడిద రంగులో ఉన్నారు. అలాటి వానరులను వెంటబెట్టుకుని శతవలి అనే వానర శ్రేష్ఠుడు వచ్చాడు. బంగారు వర్ణం గల మహా వీరుడు సుషేణుడు, తారతండ్రి, కొన్ని కోట్ల వానరులతో వచ్చాడు. అలాగే రుమ తండ్రి తారుడు కూడా వచ్చాడు. ఇరవైరెండువేల వానరులతో హనుమంతుడి తండ్రి కేసరి వచ్చాడు. గవాక్షుడూ, ధూమ్రుడూ వానర, భల్లూక సేనలతో వచ్చారు. నీలుడు నల్లటి వానరుల సేనతో వచ్చాడు. గవయుడు కొన్ని కోట్ల వానరులను తెచ్చాడు. దరీముఖుడూ, మైంద, ద్వివిదులూ, గజుడూ అసంఖ్యాకులైన వానరులను తెచ్చారు. జాంబవంతుడు పది కోట్ల భల్లూక యోధులను తెచ్చాడు. గంధమాదనుడూ, అంగదుడూ కూడా గొప్ప సంఖ్య గల వానరులను వెంట బెట్టుకు వచ్చారు. మొత్తం మీద ప్రపంచంలో గల వానర యోధులందరూ కిష్కింధ చేరారు. వాళ్ళ కోలాహలం మిన్నుముట్టింది.

వానర ముఖ్యులందరూ సుగ్రీవుణ్ణి చేరుకుని నమస్కరించారు. సుగ్రీవుడు వారిని రాముడికి సమర్పించి, వాళ్ళతో, "మీరు మీమీ సేనలను సెలయేళ్ళ సమీపంలోనూ, వనాలలోనూ విడియించి,



వాటి మంచి చెడ్డలు తెలుసుకుంటూ ఉండండి,'' అన్నాడు.

అతను రాముడితో, ''నువ్వు చెప్పినట్టు చెయ్యటానికి వానరులు కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వారిలో కామరూపులూ, పర్వతకాయులూ, కాము గమనం గలవారూ, భయంకర పరాక్రములూ ఉన్నారు. వారిని నీ ఇష్టం వచ్చినట్టు ఆజ్ఞాపించు. ఈ వానర వీరులు ఏం చెయ్యాలో నాకు తెలుసు. అయినా వారిని నువ్వే ఆజ్ఞాపించు,'' అన్నాడు.

రాముడు సంతోషంతో సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, ''సుగ్రీవుడా, సీత బతికి ఉన్నదా, లేదా? రావణుడు ఎక్కడ ఉంటాడు? ఈ సంగతులు తెలియాలి. సీత బతికి ఉన్నట్టు తెలిస్తే, ఆ తరవాత ఏం చెయ్యాలో అది మనిద్దరమూ చేద్దాం. అందుచేత నా కోరికకు తగినట్టుగా నువ్వే వానరులను ఆజ్ఞాపించు,'' అన్నాడు.

సుగ్రీవుడు వినతుడు అనేవాణ్ణి, పర్వతాకారుణ్ణి పిలిచి, అతన్ని ఒక లక్ష వానరులను వెంటబెట్టుకుని తూర్పుగా వెళ్ళమన్నాడు; అక్కడ రావణుడు ఉండే ప్రదేశం కోసమూ, సీత కోసమూ వెదకమన్నాడు; వాళ్ళు తిరిగి రావటానికి ఒక మాసం గడువు ఇచ్చాడు.

అలాగే సుగ్రీవుడు దక్షిణంగా కొందరు వానరులను పంపాడు. దక్షిణంగా వెళ్ళే వారిలో నీలుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, సుహోత్రుడూ, శరారీ, శరగుల్ముడూ, గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, ఋషభుడూ, మైందుడూ, ద్వివిదుడూ, విజయుడూ, గంధమాదనుడూ, ఉల్కాముఖుడూ, అనంగుడూ, అంగదుడూ మొదలైన వాళ్ళున్నారు. వారి వెంట విస్తారమైన వానర సైన్యం కూడా ఉన్నది.

తరవాత సుగ్రీవుడు తార తండ్రి అయిన సుషేణుణ్ణి, అనేకమంది వానర-వీరులతో సహా పడమటి దిక్కుకూ, శతవలిని లక్షమంది వానర వీరులతో సహా ఉత్తరానికీ పంపాడు.





# డిశెంబరు పువ్వులు

పూర్వకాలమందు రష్యాదేశపు ఒక పల్లెటూరిలో ఒక శ్రీమంతుడు ఉండేవాడు. అతనికి సోనియా అనే కూతురు. సోనియా తల్లి పోవటంచేత, తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. రెండవ భార్యకు నటాషా అనే ఒక కూతురు.

నటాషా పెరిగి పెద్ద అవుతున్నకొద్దీ ఆమె తల్లికి సవతికూతురుపైన అసూయ ఎక్కువ కాజొచ్చింది. పాపం, తల్లీకూతుళ్ళు సోనియాను యమయాతనలు పెట్టసాగారు.

సోనియా చక్కని చుక్క. బుద్ధిమంతురాలు. ఓరిమికి పెట్టినది పేరు. సవతితల్లి ఎన్ని తిప్పలుపెట్టినా భరించేది. తనమీద పడిన ఇంటెడు చాకిరీ సంతోషంగా చేసేది. ఇదంతా తండ్రికి తెలుసు. ఐనా, వాళ్ళను ఏమీ అనలేకపోయేవాడు.

ఏదో వంకపెట్టి తల్లీ కూతుళ్ళు సోనియాను వెళ్ళగొట్టాలని నిశ్చయించారు. ఏదైనా అసాధ్యకార్యమొకటి వప్పజెప్పి తిరిగి ఇంటిమొహం చూడకుండా ఏ అడవులలోనో పడి తిరుగులాడుతూవుండేటట్టు చేద్దామనుకొన్నారు.

అది డిశంబరు నెల. గడ్డు శీతకాలం. రష్యాదేశంలో శీతకాలమంటే మనదేశంలో లాగా కాదు. భూమి అంతా మంచుతో కప్పబడివుంటుంది. మొక్క అనేది మొలవనే మొలవదు.

సవతిబిడ్డ సోనియాను తల్లి చేరబిలిచి, "అమ్మాయీ! కొండమీదపూచే పువ్వులు కాసిని వైద్యంలోకి కావలసివచ్చినై. ఏ శ్రమలైనాపడి ఆ పువ్వులు పట్టుకురావాలి. వెళ్ళు వెంటనే." అంటూ వేగిరపెట్టింది. సంతోషంతో బయల్దేరింది సోనియా. 'పీడ వదిలింది, ఇక అది మళ్ళీ గడపతొక్కటం కల్ల' అని అనుకొని సంతోషించారు, తల్లీ కూతుళ్ళు.

రష్యా జానపద కథ



పోయిపోయి, అడవులెన్నో తిరిగి తిరిగి, సోనియా కొన్నాళ్ళకు ఒక కొండప్రదేశం చేరుకున్నది. అదంతా మంచుమయం! దారీ తెన్నూ తెలియటమేలేదు. అయితే, అల్లంత ఎత్తున మినుకుమినుకుమంటూ ఒక చిన్న వెలుగు అప్పుడప్పుడు కనిపిస్తూ వచ్చింది. ఆ వెలుగు గుర్తుగా పెట్టుకొని, ఆమె అదేవైపు పోసాగింది.

చేరువకు పోయినకొద్దీ ఆ వెలుగు పెద్దది కాజొచ్చింది. ఆమెకు ఆశ్చర్యంవేసింది. ఇంకా దగ్గరకు వెళ్ళింది. అది ఒక చలి మంట. దానిచుట్టూతా కొంతమంది పురుషులు కూర్చుని ఏదో మాట్లాడుకుంటూ చలికాచుకొంటున్నారు. సోనియా ధైర్యంగా మంటదగ్గరకు వెళ్ళి, కూర్చున్నవారికి నమస్కరించింది.

కూర్చున్న వాళ్ళు పదకొండుమంది. అక్కడనే పక్కన ఎత్తయిన ఒక సింహాసనంమీద ఒక ముసలి రాజు తలపైన కిరీటమూ చేతిలో రాజదండమూ ధరించి కూర్చున్నాడు. సోనియా పెట్టిన నమస్కారాన్ని ఆయనే అందుకున్నాడు.

కూర్చునివున్న పదకొండుమందిలో ఒకాయన ఆమెను పలకరిస్తూ, "అమ్మాయీ! నీ వెవరవు? మానవులు చొరరాని ఈ ప్రదేశానికి ఈ అపరాత్రి వేళ పనిగట్టుకొని ఎందుకు వచ్చావు?" అని ఆశ్చర్యంగా అడిగి, కొంతసేపు ఊరుకుని, "మేము మాసాలను పాలించే రాజులము. జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ మొదలైనవి మా పేర్లు. ఏడాది పన్నెండు నెలలలో ఒక్కొక నెలకు ఒక్కొక్కరం అధిపతిగా వుంటాము. ఇప్పుడు ఆ సింహాసనంమీద కూర్చున్నఆయనడిశంబరుమహారాజులుంగారు," అని ఆమెకు తెలియజెప్పాడు.

సోనియా ఆ డిశంబరు మహారాజులుంగారి కేసి తిరిగింది. ఆ మంట యొక్క కాంతికి బంగరుబొమ్మలాగా మెరిసిపోయే ఆ బాలికను చూశాడు రాజు. ఆమె ముఖం చిరునవ్వుతోనే ఉన్నప్పటికీ, అమాయకమైనదైన్యంతో కూడివున్నట్టు కనిపించింది.

దయనీయమైనఆమెచరిత్రవినటంతోనే డిశంబరురాజు, ఆమెను ఓదారుస్తూ తను గద్దె దిగి, మంటవద్ద కూర్చునివున్న 'జూన్' రాజును సింహాసనం ఎక్కమన్నాడు.

జూన్‌రాజు గద్దెమీద కూర్చుని, ఆజ్ఞా పూర్వకంగా ఒక్కసారి దండం ఊపేసరి కల్లా కొండమీది మంచు తృటిలో కరిగి పోయింది. చూస్తూవుండగానేభూమిఅంతా పచ్చగా, కనుపండువుగా కనిపించింది. మొక్కలు మొలిచినై. చేలుపండినై. పూల మొక్కలు పుష్పించినై. చెట్లు కాయలతో నిండిపోయినై.

రాజు అనుమతిపైన సోనియా అపరి మితమైన సంతోషంతో ఒడినిండా కావలసి నన్ని పూవులు కోసుకొన్నది. పువ్వులు సృష్టించి ఇవ్వటమేగాకుండా, ఇంటికి వెళ్ళేవరకు అవి వాడిపోకుండా ఉండేట్టు కూడా రాజు వరం ఇచ్చాడు. సోనియా కోరిక నెరవేర్చడంతోనే జూన్‌రాజు గద్దె దిగి, మళ్ళీ చలిమంటవద్దకు పోయాడు.

అప్పుడు డిశంబరు మహారాజులుంగారు యథాప్రకారం గద్దె ఎక్కాడు. జూన్‌రాజు దిగటంతోనే మొక్కా, మోడూ మాయమై నాయి. డిశంబరురాజు ఎక్కటంతో నేమళ్లీ కొండలన్నీ మంచుతో ఘనీభవించినై.

పన్నెండుగురు రాజులకూ సోనియా కృతజ్ఞతతెలిపి, సెలవుతీసుకొని వెళ్లిపోయి ఇల్లు చేరుకుంది. సోనియా కంటబడేసరి కల్లా తల్లీ కూతుళ్ళకు అమితాశ్చర్యం కలిగింది.



ఆమె తిరిగి వస్తుందని వాళ్లు కలలోనూ తలచలేదు. పైగా, అకాలంలో పువ్వులు పుట్టించుకువచ్చి, కేవలమూ ఒక అసాధ్య కార్యాన్ని సాధించుకువచ్చిన ఆమె ప్రజ్ఞకు మరీ ఆశ్చర్యం పొందారు. అంతేకాదు. ఆమెపైన అసూయ చెందారు.

"ఈ పువ్వులు ఎక్కడ పుట్టించుకు వచ్చావు చెప్పు?" అని వాళ్ళు గద్దించారు. జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పింది సోనియా. అపురూపమైన ఈ పువ్వులను తీసుకువద్దామని నటాషా కూడా బయల్దేరింది. శ్రమపడి కొండ ప్రదేశం చేరుకుంది. ఈమెకూ కొండ మీద వెలుగూ, మంటచుట్టూ కూర్చునివున్న రాజులూ కనిపించారు.

అందులో ఒక రాజు ఆమెను పలకరించాడు. అందుకామె కోపంగా, "పోవయ్యా పెద్దమనిషీ, నా గొడవ నీకెందుకు?" అనేసి, తనదారిని పోబోయింది. నాలుగడుగులు వేసిందో లేదో, రాజు దండం తిప్పేసరికి, దబదబా మంచు పెల్లలు మీదపడి మరి ఆనవాలులేకుండా ఆమె కప్పబడిపోయింది.

కూతురు కోసం ఆత్రంతో ఎదురు చూసింది తల్లి. ఎన్నాళ్లకూ రాకపోవటంతో తనే బయల్దేరింది. ఈమెకూడా శ్రమలుపడి కొండ చేరుకుంది. రాజులువేసిన కుశల ప్రశ్నకు ఈమెకూడా వికటంగానే జవాబు చెప్పేసరికి, కూతురుకు పట్టిన గతే తల్లికీ పట్టింది!

తల్లీకూతుళ్లు తిరిగి రాకపోవటంతో సోనియాకు కలవరం పుట్టింది. ఆమె మళ్ళీ మంచుకొండలవద్దకు పోగా ఆ రాజులవల్ల జరిగిన సంగతిఅంతా తెలిసింది. సోనియా తన మాటమంచితనంతో వారి మనసులు కరిగించి, సవతి తల్లినీ నటాషానూ బతికించుకుంది.

జూన్‌మాసంలో పూయవలసిన పువ్వులను ప్రత్యేకించి సోనియాకోసం డిశంబరు నెలలోనే సృష్టించిఇచ్చిన జూన్‌మహారాజు అజ్ఞప్రకారం ఆ పువ్వులకు డిశంబరుపువ్వులనే పేరు శాశ్వతంగా నిలిచిపోయింది.






# మారిన తీర్పు

కనకాంబరుడనే ఒక చిన్న రైతును, లక్ష్మీపురంలో అందరూ గ్రామ పెద్దగా గౌరవించేవాళ్ళు. నిజానికి ఆయనకు ఎలాంటి అధికారం లేకపోయినా, ప్రజలు తమకు పరిష్కారం దొరకని సమస్య ఎదురైనా, లేక తమలో తమకు ఎలాంటి తగవులు వచ్చినా, సలహాకోసం ఆయన దగ్గిరకు వస్తూండేవాళ్ళు.

కాలం గడిచి క్రమంగా కనకాంబరుడు వృద్ధుడవడంతో, ఆయన కొడుకు వల్లభుడు గ్రామపెద్దగా చలామణి కాసాగాడు. కనకాంబరుడు గ్రామంలో అందరినుంచీ గౌరవ మర్యాదలు తప్ప, తనకంటూ ఆస్తిపాస్తులు ఏమీ సంపాయించుకోలేదు. వల్లభుడు తనకు తండ్రి నుంచి సంక్రమించిన రెండెకరాల భూమిని సొంతంగా కష్టపడి సాగుచేసుకుంటూ జీవించసాగాడు.

ఒకనాడు ఆ గ్రామానికి చెందిన రామయ్య అనే వృద్ధుడూ, అతడి కొడుకు భీమయ్యా వల్లభుడి వద్దకు వచ్చి, తమ తగవు తీర్చమన్నారు.

ముందుగా రామయ్య, వల్లభుడితో, "చూడు, బాబూ! నేనేమో బాగా ముసలివాణ్ణయిపోయాను. నేనీ వయసులో కష్టపడి సంపాదించలేను. నా కొడుకు భీమయ్య నన్ను పోషించనంటున్నాడు. నాకు వీడొక్కడే కొడుకు. ఇప్పుడు నాకు తిండీ, బట్టా దొరికే మార్గమేమిటో, నువ్వే చెప్పు?" అన్నాడు.

ఇందుకు సమాధానంగా భీమయ్య, "మా నాన్న సంపాదించే వయసులో వ్యసనాలకు బానిసై, మా ఆస్తినంతటినీ నాశనం చేశాడు. అందుచేత, ఇప్పుడు నేను కేవలం నా రెక్కల కష్టం మీద బతకవలసి వచ్చింది. ఇలాంటి స్థితిలో

పెంటకోట సోమినాయుడు

నా తండ్రిని పోషించే భారం, నేనెలా మోయగలనో మీరే చెప్పండి?'' అన్నాడు.

ఇద్దరి వాదనా విన్న వల్లభుడు కొంచెం సేపు ఆలోచించి, ''రామయ్యా! నీ కొడుకు భీమయ్య సంపాదించేది అతడి పొట్ట గడిచేందుకే సరిపోతుంది. ఆ స్థితిలో నిన్నెలా పోషించగలడు? అందువల్ల, నీ పోషణభారం భీమయ్య శక్తికి మించిన పని,'' అని భీమయ్య పక్షాన తీర్పు చెప్పాడు.

కొన్నాళ్ళకు వల్లభుడి తండ్రి కనకాంబరుడు చనిపోయాడు. వల్లభుడికి ఒక కొడుకు పుట్టాడు. వాడికి జగపతి అని పేరుపెట్టి, వల్లభుడు అల్లారు ముద్దుగా పెంచసాగాడు.

ఒక రోజున అతడి వద్దకు సూరయ్య అనే వృద్ధుడూ, వాడి కొడుకు వీరయ్య వచ్చారు.

సూరయ్య, వల్లభుడితో, ''బాబూ, నాకు వీరయ్య ఒక్కడే కొడుకు. వాణ్ణి కష్టపడి పెంచి పెద్దచేశాను. కాని, వాడు వృద్ధాప్యంలోకి అడుగు పెట్టిన నన్ను పోషించనంటున్నాడు. ఇప్పుడు నాకు బిక్షాటన తప్ప మరొకమార్గం లేదు,'' అన్నాడు దీనంగా.

దానికి సమాధానంగా వీరయ్య, వల్లభుడితో, ''అయ్యా! నా తండ్రి నన్ను పెంచి పెద్దవాణ్ణి చేశాడు. కాదనను. కానీ అమధ్య నాకు పెళ్ళయింది. పిల్లలు పుట్టారు. ఇప్పుడు నేను అదనంగా మరొక



మనిషిని పోషించే స్థితిలో లేను,'' అన్నాడు.

వెంటనే వల్లభుడు, వీరయ్యతో, ''తండ్రిని పోషించవలసిన బాధ్యత కొడుకుది. అందుచేత, నిన్ను పెంచిపెద్ద చేసిన, నీ తండ్రి ఋణం తీర్చుకోవాలంటే, నీ తండ్రిని జీవితాంతం నువ్వు పోషించి తీరాలి. ఇక నీ భార్యా పిల్లలూ, ఆర్థిక పరిస్థితీ అంటావా—దానికి ఎవరు చేయగలిగిందేమీ లేదు. నువ్వు తాగే కలో గంజో నీ తండ్రికీ పొయ్యి,'' అన్నాడు.

ఆ గ్రామంలో భూషయ్య, శేషయ్య అనే వృద్ధులిద్దరున్నారు. వాళ్ళు కనకాంబరుడికి బంధువులు. వాళ్ళు ఒకనాటి సాయంకాలం చెరువుగట్టున కూర్చుని, పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్న సమయంలో, భూషయ్య, ''శేషయ్యా! ఈమధ్య తగవుపడి తన దగ్గిరకు వచ్చే వాళ్ళకు, వల్లభుడిచ్చే సలహాలూ, తీర్పులూ చూస్తూంటే, వాడేమైనా తిక్క మనిషా అనిపిస్తున్నది. వాడి తండ్రి కనకాంబరుడు ఎంత న్యాయంగా చాకచక్యంగా సమస్యలకు పరిష్కారం చెప్పేవాడు!'' అన్నాడు.

''వల్లభుడు తిక్కమనిషేమో అన్న అనుమానం, నీకెందుక్కలిగింది? వాడిచ్చే తీర్పుల్లో, నీకు నచ్చనివేమిటి?'' అని అడిగాడు శేషయ్య.

''రామయ్యా, అతడి కొడుకు భీమయ్య గొడవపడి, మనవాడి దగ్గిరకు తీర్పుకు



వెళ్ళిన సంగతి నీకు గుర్తున్నదికదా ?'' అని అడిగాడు భూషయ్య.

''ఆఁ, గుర్తులేకేం!'' అన్నాడు శేషయ్య.

''ఆ తండ్రీకొడుకుల తగవు పరిష్కారంలో, వల్లభుడు కొడుకు తరఫున మాట్లాడి, అతడికి అనుకూలంగా తీర్పు చెప్పాడు. అదే వల్లభుడు, ఈమధ్య తన దగ్గిరకు తీర్పుకోసం వచ్చిన సూరయ్య, వీరయ్యలలో తండ్రి సూరయ్య తరఫున మాట్లాడి, కొడుకు వీరయ్యకు వ్యతిరేకంగా తీర్పిచ్చాడు. దీన్ని తిక్కకాక మరే మనాలి ?'' అని అడిగాడు భూషయ్య.

శేషయ్య ఒకటి, రెండు క్షణాలు తలాడిస్తూ వూరుకుని తర్వాత, ''భూషయ్యా, ఎంతటి న్యాయాధిపతి అయినా, అతడి జీవనస్థితిగతులూ, అతడి తీర్పులూ బింబ ప్రతిబింబాలు. మన వల్లభుడు దానికేమీ అతీతుడు కాదు,'' అన్నాడు.

''కొంచెం వివరంగా చెప్పు!'' అన్నాడు భూషయ్య.

''వల్లభుడు, రామయ్య కొడుకు భీమయ్య తరఫున మాట్లాడడానికి కారణం, అప్పట్లో అతను వృద్ధుడైన తండ్రి కనకాంబరుణ్ణి అయిష్టంగానే పోషిస్తూండడం; ఆ అయిష్టాన్ని పరోక్షంగా రామయ్య మీద కనబరిచాడు,'' అన్నాడు శేషయ్య.

''సరే, మరిప్పుడు తండ్రి సూరయ్యకు అనుకూలంగా తీర్పివ్వడంలో అర్థమేమిటి ?'' అని అడిగాడు భూషయ్య.

''వల్లభుడు, వీరయ్యలో తన కొడుకును చూసుకుని, భవిష్యత్తు గురించి భయపడ్డాడు. ఎందువల్లనంటే, ఇప్పుడు తన తండ్రి చనిపోయాడు కాబట్టి, తను తండ్రి స్థానంలో వున్నాడు. అందువల్ల తండ్రి అయిన సూరయ్యను సమర్థించాడు,'' అని వివరించాడు శేషయ్య.

అప్పటికి భూషయ్యకు అర్థమైంది—మనిషి సొంత అనుభవాలనుబట్టే, ఎదుటి మనిషికి చెప్పే నీతులు మారుతూంటాయని!






# చిక్కులో పడిన నక్క

అడవి సమీపంలో ఒక కాపు నివసిస్తూండే వాడు. అతడు కొంత మేర దున్ని ఆకుకూర మడులు నాటాడు. కుందేలు వాటిని తిన మరిగింది. ప్రతి రాత్రీ ఎవరో వచ్చి తన ఆకుకూరలు తినిపోతూండటం గమనించి కాపు ఒకనాడు ఉచ్చుపన్నాడు.

ఆ ఉచ్చును గమనించక కుందేలు రాత్రి అందులో చిక్కుకున్నది. దాన్నుంచి తప్పించుకునే ఉపాయం కనిపించలేదు కుందేలుకు.

తెల్లవారుజామున కాపు వచ్చాడు. కుందేలును చూసి, "ఓహో! దొరికావా? రోజూ నా కూరలు తినిపోదామనుకున్నావా? నీ సంగతి చెబుతా ఉండు!" అని, కుందేలుకు బుద్ధి చెప్పటానికిగాను చింతబరికెలు తీసుకురావటానికి వెళ్ళాడు.

"తప్పించుకునే ఉపాయం లేదు. ఇవాళ నాకు మూడింది! పొద్దునే లేచి ఎవరి మొహం చూశానో!" అనుకుని కుందేలు కదలక మెదలక కూచున్నది.

సరిగా ఆ సమయానికే ఒక నక్క అటుగా వచ్చి, కుందేలును చూసి, "ఓహో కుందేలా? ఇక్కడ కూచున్నావేం? నీ మెడకు ఆ ఉచ్చు ఏమిటి?" అని అడిగింది ఆశ్చర్యంగా.

కుందేలు పొట్ట చేతబట్టుకుని నవ్వుతున్నట్టు అభినయిస్తూ, "భలే గమ్మత్తు! పిల్లలకి సుస్తీగా ఉండటం వల్ల, సాతాని వైద్యుణ్ణి అడిగి నాలుగు కస్తూరి మాత్రలు తీసుకొద్దామని వెళుతుంటే ఆవు అత్త ఎదురై, 'మా అమ్మాయి పెళ్ళి చేస్తున్నాం, నువ్వు రాక తప్పదు.' అన్నది. నేను తొందర పని మీద వెళుతున్నాను గాని, ఈ సారికి నన్ను వదిలెయ్యమన్నా. కాదు కూడదు పెళ్ళికి వస్తే తప్ప ఊరుకునేది లేదని నన్ను ఆవు అత్త నిర్బంధం పెట్టింది. సరే, నా పని

పూర్తి చేసుకుని వస్తున్నానని చెప్పాను కాని ఆవు అత్త నన్ను నమ్మక, ఇక్కడ కట్టేసి పెట్టి, నన్ను తీసుకురావటానికి ఎవరినన్నా పంపిస్తానని వెళ్ళిపోయింది. అదీ సంగతి. నన్ను విడిచిపెట్టేద్దూ. నీ పుణ్యం వుంటుంది. పిల్లలకు ఆ మాత్రలు పడితే గాని నేనింకోపని చూసుకోవటానికి లేదు. అంతగా పెళ్ళికి పెళ్ళాలనుంటే నిన్ను కట్టిపెడతాను. వాళ్ళు వచ్చి నిన్నే తీసుకుపోతారు," అన్నది కుందేలు.

నక్క ఈ మాటలు నమ్మి, "అవును, నేను నిన్ను విప్పుతాను, నువ్వు నన్ను కట్టెయ్యి. నన్ను ఒక్కరూ ఏ పెళ్ళికీ పిలవరు!" అన్నది.

కుందేలు, నక్కను తనస్థానంలో కట్టేసి, "నేను వైద్యుడి దగ్గిరికి పోయి ఇప్పుడే వస్తాను. ఈ లోపల పెళ్ళివారు రానే వస్తారులే!" అంటూ కొంచెం దూరం వెళ్ళి ఒక పొదలోదాగింది.

ఇంతలో కాపు చింతబరికెలు తీసుకుని వచ్చాడు, నక్కను చూసి, "ఇదేమిటి? నా ఆకుమళ్ళు పాడుచేసేది పోయి కోళ్ళు కాజేసేది వచ్చిందా? దేహశుద్ధి చేస్తానుండు!" అని చింతబరికెలు చెత్త అయ్యేదాకా నక్కను ఎడాపెడా ఏకి వదిలాడు.

తరవాత వాడు తన కుక్కలను తీసుకురావటానికి బయలుదేరాడు.

అప్పుడు కుందేలు తిరిగి వచ్చి నక్కను చూసి, "ఇంకా ఇక్కడే వున్నావా? పెళ్లివారు రాలేదా?" అన్నది.

"నాకు పెళ్ళీ వద్దు, పెడాకులూ వద్దు ఈ ఉచ్చు త్వరగావిప్పు!" అన్నది నక్క.

కానికుందేలుతాత్సారంచేసిఆ కబుర్లూ ఈకబుర్లూ చెప్పసాగింది. వెంటనే ఉచ్చు విప్పితే నక్క తనను బతకనివ్వదు.

కొంతసేపటికి దూరాన కాపూ, కుక్క కనపడటం చూసి కుందేలు నక్కను విడిపించడానికి ఉచ్చువిప్పింది. కుక్కలు ఆ చోటికి సమీపిస్తున్నాయి. నక్క ఆ క్షణమే బలంకొద్దీ పరుగెత్తి పారిపోయింది. కుందేలు కూడా మరోదిక్కుగా పరిగెత్తిపోయింది!



## తిమింగిల జలం!



తిమింగిలం నీళ్ళు పైకి చిమ్మదు: ఆవిరిని చిమ్ముతుంది. నీళ్ళలో చాలా సేపు ఈదడంతో తిమింగిలం ఊపిరితిత్తులలోని గాలి ఒక రకమైన తడితో వేడెక్కుతుంది. తిమింగిలం నీళ్ళ పైకి వచ్చి ముక్కు ద్వారాన్ని తెరిచినప్పుడు, ఒక్కసారిగా ఆవిరి పైకి చిమ్మబడి చుట్టూవున్న చల్లదనం వల్ల ఘనీభవించి నీళ్ళ గొట్టంలా కనిపిస్తుంది.

## బోవర్ పిట్ట

న్యూగినియా, ఆస్ట్రేలియా ప్రాంతాలలో నివసించే మగబోవర్ పిట్ట చిన్న చిన్న పుల్లలతో, మట్టితో పొదరిల్లు కట్టి, ఆడ పిట్టలను ఆకర్షించడానికి, మెరిసే వస్తువులనూ, పువ్వులనూ దాని మీద అతికిస్తుంది!



## అపాయకరమైన కీటకం



యుద్ధాలనూ, ప్రమాదాలనూ మినహాయిస్తే, మానవ మరణాలలో సగం మలేరియా దోమకాటువల్లే సంభవిస్తున్నాయి! పాతరాతి యుగం నుంచి, ఆఫ్రికా, ఆసియా ఖండాలలో దోమకాటుకు గురై యేటా పది లక్షలమంది ప్రాణాలు కోల్పోతున్నారు!

# Ta dum, They is here

**Oops!
Kiddy grammar
sure is catchy—Ya,
they are here.**

Bow Wow 'n' Floppy the doggies (wuff! wuff!), Jumbo the elephant, Wobbit the rabbit, Teddy 'n' Sporty your bear buddies, the mouse of your house —Squeeks, not to mention Flipper the dolphin 'n' Bunny with the Twins. They are all part of the CUDDLES family. And hang on—there's more to come.





The one thing we didn't do while making our toys was fool around. We left that entirely for your kid to do. Come, check us out.

What stuffing to use, what shape to give, which colour to use...... We've spent long months in designing and crafting the toys which can take on the toughest torture test ever—childhandling. To ensure that they're safe.

**CUDDLES**

CHANDAMAMA TOYTRONIX

In collaboration with Sammo Corporation, S.Korea

**Chandamama Buildings, 188, NSK Salai, Vadapalani, Madras-600 026.**

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



V. Rajamani



Anand P. Patel

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మైత్రి ఎరుగదు జాతిభేదం! రెండవ ఫోటో: మంచి మధ్యే మమత సాధ్యం!

పంపినవారు: టి. జె. మోహన్‌కుమార్, ఫట్‌శేనర్, రంగారెడ్డి జిల్లా, (ఆ. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.



Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# విజయచిత్ర

సినిమా వినోదానికి ప్రతినిధి
పాఠకులకు పరిశ్రమకూ వారధి

వర్ణచిత్రాలు కంటికి ఆనందం
తారల కబుర్లు మనసుకు ఆహ్లాదం

చూసినకొద్దీ చూడాలనిపిస్తుంది
చదివినకొద్దీ చదవాలనిపిస్తుంది

ప్రజాదరణే పునాదిగా



24 సంవత్సరాలుగా
నిర్విరామంగా, నిత్యనూతనంగా
వెలువడుతోంది...

తప్పక చదవండి - చదివించండి!

## విజయచిత్ర

చిత్రప్రియుల అభిమాన పత్రిక

# Vital tips for colouring


Luxor Bambino colour set
An adventure with colours.


Luxor Mickey Mouse Colours
Enter the fairyland of colours.


Luxor Colour Pens
Sing a rainbow, paint a song


Luxor Disney fun set
For fun, frolic and fantasy.


Disney Inoxcolor Plastic Crayons
Colourful times ahead


Luxor Sign Pen
To make your little dreams come true.


Donald Duck Magic Colours
For the magician in you.

Bestsellers
PENNED BY LUXOR



LUXOR PEN CO., 229, Okhla Industrial Estate, Phase III, New Delhi-110020, India.
Tel: 633318, 6833372, 6835607. Tlx: 031-75069 SIGN IN. Fax: 011-6847602. Tel: Delhi (Sales): 522956, Bombay: 6730251, Calcutta: 250407

CLARION D 254

